
పేగు ప్రేమకు దూరమై
అనుక్షణమూ
తల్లడిల్లిన కన్నతల్లి కథ!
సృష్టిలో తీయనిది తల్లిప్రేమ !
స్త్రీలోకానికి పిలుపు!
పండంటి కాపురం
ధర్మాత్ముడు
గృహప్రవేశం
కార్తీకదీపం
కథారచయిత
యం. ప్రభాకరరెడ్డి
పెంచిన ప్రేమతో
అమృతాన్ని పంచిన
తల్లి కాని తల్లి కథ!
లక్ష్మీకిరణ్ ప్రొడక్షన్స్
శ్రీరామచంద్రుడు
బి.భాస్కరరావు


JAGATI Rs. 2-00 May 1989

34th Year of Publication




## యుగాది - మే 1989

### యతి - నృపతి

రాజవు నీవు మేము గురురాట్కలిత ప్రతిభాభిమాన వి
భ్రాజి మహోన్నతాత్ములము, భవ్య ధనప్రథితుండ వీవు స
ద్రాజి నుతించు మా యశము, దవ్వు సుమీ మన వాసి, మమ్ము ని
ర్వ్యాజత జూడవేని యనురాగము మాకును లేదు నీయెడన్

ఫలములు చాలు జీవికకు పానము చేయ జలంబు చాలు వ
ల్కలములు చాలు గట్టుట కిలాతలముల్ శయనింప జాలు ని
ష్ఫల నవవిత్త శీధురస పాన విజృంభిత మోహలీన చి
త్తులగు నికృష్ట భూపతుల దుర్ణయ మించుకయున్ సహింతుమే

—భర్తృహరి

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 45-00. - 5 సం॥లకు రు. 100-00 జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : కొమ్మరాజు



# పాఠకుల లేఖలు

మాన్యమిత్రులు శ్రీ చందూర్‌గారికి నమస్కారములు. క్షేమద్వయానంతరం.... 'జగతి' ద్వారా ఎన్నో విషయాలు తెలుసుకుంటున్నాను. పూజ్యులు ముద్దా విశ్వనాథంగారిని గురించి తెలియజేసిన పత్రిక బహుశః మీ దొక్కటే అనుకుంటాను. శ్రీమతి సరోజనీ ప్రేమ్‌చంద్‌గారి రచన నన్ను బహుధా అలరించింది. అలాగే సుప్రసిద్ధ ఆలంకారికులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిని గురించి కూడా వ్యాసం ప్రకటించగలరు.... శ్రీమతి మాలతీ చందూర్‌గారికి 'రసమయి' అవార్డు వచ్చినట్టు ప్రతికాముఖంగా తెలుసుకుని, మా శ్రీమతి సుశీల నేనూ ఎంతగానో సంతోషించాము - మా అభినందనలు తెలుపగలరు. సమర్థులకు జరిగే సత్కారమే సత్కారం.... ఇక్కడి మిత్రులు నా షష్ట్యబ్దిపూర్తి జరపాలని నిశ్చయించారు - ఈ మార్చి రెండవ వారంలో జరగవచ్చు. దాదాపు నాలుగు దశాబ్దులుగా సాహిత్య రంగంలో శ్రమిస్తున్న నేను, సుమారు డెబ్బయిదాకా చిన్నవీ పెద్దవీ పుస్తకాలు ప్రచురించగలిగాను. ఈ మధ్యనే నా 'తిరుక్కురళ' వెలువడింది. తమిళ కురళకు తెలుగు లిప్యంతరంలో ఇచ్చాను. ఇలా 'తిరుక్కురళ' తెలుగులో వెలువడటం యిదే మొదటిసారి. యథాశక్తిని సేవ చేశానన్న తృప్తి నాకున్నది. ఇక గుర్తింపు అంటారా, కృష్ణపరమాత్ముడు ఆదేశించినట్లుగా, కర్తవ్యాచరణమే మన ధర్మం, ఫలితం ...... నేను ఈ జూన్‌లో ఉద్యోగ విరమణ చేస్తున్నాను - ఆ తర్వాత మద్రాసులో స్థిరపడాలని నా ఆశ.... మన మిత్రులకు నన్ను గుర్తుచేయండి.

—చల్లా రాధాకృష్ణ శర్మ
మధుర

చందూర్‌గారికి : శుభాంజలులు.... నేనెప్పుడూ పాలెపు రామన్న, యన్‌ఆర్ భరద్వాజనే ! మరో పేరుతో పత్రికా రచనలు ఎరుగను.... నడుం పొడుం అయి కమ్యూనిష్టు కొడవలిలా వంకర పోతోంది.... ఓమారురండి - ఎంతో మౌలికమైన వ్యాసాలు మీ చేతిలో వుంచుతాను. జర్నలిజమ్ తీర్థంకరుల చేతుల్లోకి జారుకుంది - హిస్టరీ జాగ్రఫీ తెలియని బృహస్పతులు.... మీరిద్దరూ ఒకసారి రండి - కనీసం రెండుగంటలు వుండాలి.

—బియస్ రామారావు
మద్రాసు-24

శ్రీచందూర్‌గార్కి : అనేక నమస్కారములు. 'జగతి' ప్రతి పేజీ చదువుతాను - అదొక జబ్బు అయి

పోయింది. ముప్ఫయిమూడు సంవత్సరాలుగా ఇల్లాంటి పత్రికను ప్రకటించడం చాలా గొప్ప విషయం. సెన్స్ వుండి సెక్సులేక, మేటరు ఉండి చెత్త వ్రాయక, ఈ రోజుల్లో పత్రికను నడపగలిగే మీ ధైర్యమూ, లక్ష్య సాధన మెచ్చుకోదగ్గవి - మనసారా అభినందిస్తున్నాను.... ఎందుకో మీరంటేను, బియస్సార్ కృష్ణ అంటేను మేధస్సు పులకిస్తుంది.... చెల్లాయిని మరీమరీ అడిగినట్లు చెప్పండి.... ప్రేమ, గౌరవం, అభిమానం, ఆత్మీయిత సమపాళ్లల్లో పంచిన గ్లాసుడు కూల్ డ్రింక్ అందించే.... మీ —

— పేకేటి శివరామ్
మద్రాసు-17

శ్రీ చందూర్‌గారికి: నమస్కారములు. 'జగతి' ప్రతినెలా, నేను మీ అందరి మధ్యావున్న అనుభూతిని కలిగిస్తోంది. హాస్పిటల్‌లో ఎనిమిది నెలలు నరకం అనుభవించాను - ఇప్పుడు నా ఆరోగ్యం బాగానే వుంది. అడ్రస్ మార్పు నోట్ చేసుకొన ప్రార్థన.... మీరు హైదరాబాదు వచ్చినప్పుడు ఫోన్ చేసినా, వచ్చే ముందు తెలియచేసినా, కలుసుకుంటాను. మీ తియ్యటి కబుర్లు వినే అవకాశం కోసం ఆరాటపడుతున్నాను - ఎంతకాలమైపోయిందో!

— గౌతమ్
హైదరాబాదు-17

'జగతి' సంపాదక మహాశయులు శ్రీ యన్నార్ చందూర్‌గారికి: నమస్కారం. 'డైరీ'లోని విషయాల్లో సాహితీవ్రతులు డా॥ బెజవాడ గోపాల రెడ్డిగారిని గురించి, స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి గురించి, వారి వ్యక్తిత్వ వైశిష్ట్యాలను తెలిపినందుకు సంతోషం. 'డైరీ' శీర్షిక సమకాలీన సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాల చరిత్ర.... 'మనదేవతలు' అన్న పుస్తకాన్ని రికార్డెడ్ డెలివరీ ద్వారా ఈ మధ్య మీకు పంపాను.

— జానమద్ది హనుమచ్ఛాస్త్రి
కడప-4

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచన మృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతకనేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 35 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాలధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V.P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి – విజయవాడ – 2

# కోరికలు

## డా॥ బెజవాడ గోపాలరెడ్డి

పొంగే పాలను
పట్టి ఉంచుకోలేదు పసిడి పాత్రయైనా
ఒలికి పోవడానికే
తులుకుచు వస్తాయి అంచులపైకి !

✠ ✠

స్పర్శకు అర్థాలు వేరు
పాదస్పర్శ భక్తిని తెలిపేది
కరస్పర్శ స్నేహాన్ని తెలిపేది
కపోలస్పర్శ వాత్సల్యాన్ని తెలిపేది
కేశస్పర్శ ఆగ్రహాన్ని తెలిపేది
అధరస్పర్శ ప్రేమను తెలిపేది
తనుస్పర్శ అన్నిటినీ తెలిపేది !

✠ ✠

మూఢాచారాలను కప్పడానికి
పుస్తకాలు ఉన్నాయి
పుస్తకాలు మంచిని గాని చెడ్డను గాని
రుజువు చేసి ప్రమాణాల నిస్తాయి
పుస్తకాలు వ్రాసేది మనబోటి వాళ్లే
దేవ సమానులు కాదు, దివ్య
ప్రాణులు కాదు.

✠ ✠

తిథి, ముహూర్తము లేక వివాహ
మాడాను
మంత్రములతో నిమిత్తము లేక
త్రివేణిలో గంగోత్రిలో స్నానమాడాను
విగ్రహారాధనలో అట్టే నమ్మకము
లేకనే

దేవాలయాలన్నీ దర్శించాను
స్వయముగా రాట్నము త్రిప్పుకున్నా
1920 నుండి ఖద్దరునే వాడుచూ
వచ్చాను.

✠ ✠

కాంగ్రెసు చిహ్నముగ
1937 ఎన్నికలతో పచ్చరంగుతో
ప్రారంభమైనది
రంగులు పోయి బొమ్మలు వచ్చినపుడు
కాడితో జతకూడిన రెండు ఎద్దులుగా
మారింది
తర్వాత ఆవు దూడగా మారింది
ప్రస్తుతము హస్తముగా చలామణి
యగుచున్నది

✠ ✠

రామనవమి నాడు అయోధ్యను
చూచాను
కృష్ణాష్టమినాడు మధురలో ఉన్నాను
బుద్ధుని లుంబిని చూచాను
క్రీస్తు పుట్టిన బెతల్‌హాం దర్శించాను
80 సంవత్సరములు నాకు నిండిన
యేడు
గాంధీజీ పుట్టిన పోర్ బందరు యాత్ర
పుట్టిన నాడు చేయాలని తలచాను.

✠ ✠

నల్ల వెంట్రుకలు తెల్లబారినవి
పలచపడిన బట్టతల ఒళ్లు గుడికి

కలశమైనది
కృత్రిమ దంతములు నోటిలో
పుష్పించినవి
దృష్టి మందగించి కంటి అద్దాలపై
ఆధారము
వినికిడి తగ్గి, తబ్బిబ్బు
లగుచుంటాను
నలుని రూపు తలక్రిందులై
మాయమైనది
అద్దము 'బాహుక సోదరా!'
అని పిలిస్తే
న్యాయబద్ధమే కదా!

✠ ✠

మనిషి తప్పిదాల మూట
మూట విప్పితే అంతా దొసగులే
వానిని చూచి, అతనే సిగ్గిలుచుంటాడు
అట్లని మారి మానితే మంచిదే
కాని మారలేడు, మానలేడు
అందుకే అతను మానవుడు.
పుడమి బురదలో ఈదుచు
నుంటాడు.

✠ ✠

దేవాలయాలకు వెళ్లడమెందులకు
అచ్చటి నిషేధాజ్ఞలకు శపించుట
ఎందులకు
నీ హృదయమందిరములో
లేని దేవుడు
ఆ మందిరములో ఉన్నాడా?

✠ ✠

మానవుడు పుట్టిన చాలా యుగాలకు
పుట్టాడు దేవుడు
మానవుడు పుట్టించిన
చిత్రములలో
పెద్ద చిత్రమే దైవము!

✠ ✠

"దేశము అనేక క్లిష్టసమస్యలను
ఎదుర్కొనుచుంటే
కాంగ్రెసు ప్రభుత్వాలు
మద్యముమీదా, దేవదాసీలమీదా
చర్చిస్తున్నాయి" అన్నాడు
సి. ఆర్. రెడ్డి 37వ సంవత్సరములో
భలో క్తిగ!

✠ ✠

ఒకరు ఎం. ఎల్. ఎ
కావాలని కోరడం
యం. ఎల్. ఎ. మంత్రి
కావాలని కోరడం
మంత్రి ముఖ్యమంత్రి
కావాలని కోరడం
తప్పిదమా, పాపమా?
రాజకీయాల్లోకి రావడం
ఆరోగ్యాన్ని చక్కబెట్టుకోడానికా
మోక్షము పొందడానికా
రాజకీయాలు ఆరోగ్య మందిరాలు
ముముక్షువుల ఆశ్రమాలు కావే
సేవా పతాకాన్ని చేబూని
అధికారాన్ని చేపట్టాలనే గదా
కాదంటే మోసమే అగుతుంది
ఆత్మవంచనే అగుతుంది.

✠ ✠

సత్యభామ అనగానే
పారిజాతాపహరణం,
కృష్ణతులాభారము
మనస్సు కవాటాలను తట్టుతాయి

పెనిమిటిని గుప్పెట్లో పెట్టకోరే రాణిగా
ఈర్ష్యాళువైన సవతిగ కన్పిస్తుంది
నరకాసురవధలోని వీర
సత్యభామగ
గోచరింపదు, దీపావళి
పండుగలలో తప్ప.

✠ ✠

రాజ్యాంగ చట్టములో
ఉన్న అధికారాలను, లేని
అధికారాలను
ప్రెసిడెంటు ఉపయోగించాలని
కోరుతారు ప్రతిపక్ష నాయకులు
వారి వారి అగ్రహాలను బట్టి -
అట్లాగే గవర్నరు వ్యవహరిస్తే
ఊరుకుంటారా ?

✠ ✠

ప్రెసిడెంటు అధికారాలు విస్తరిస్తే
పార్లమెంటు అధికారులు తగిన
వన్నమాటే !
ప్రజాస్వామ్యము కురుచబడినట్లే
సంపాదించుకొన్న ప్రజా రాజ్యము
అట్టి ఉద్దేశ్యముతోనేనా ?

✠ ✠

బయట ప్రపంచములో
ప్రమాదాలు పెద్దవానికే
గ్రహణాలు సూర్య చంద్రులకే
నక్షత్రాలకు కాదు ;
తుఫాను భయాలు వృక్షాలకే
తృణాలకు కాదు !

'ఆంధ్ర సారస్వత పరిషత్తు'
వారి ప్రచురణ - 'కళికలు'



విశ్వకవి

# గురుదేవ్ టాగూర్

యన్నార్ చందూర్

హిమాలయ శిఖరం గురించి, మానవ సరోవరం గురించి ఏం చెప్ప గలమో, రవీంద్రనాథ్‌టాగూర్ గురించీ అంతే. అసలు మన భారతీయ సంస్కృతి మహానుభావుల జీవిత విశేషాల పట్ల అనవసర కుతూహలం కనబరచదు. ఆ మాట కొస్తే వాల్మీకి గురించి మనకేం తెలుసు - ఆయన ఆదికవి అని తప్ప. తన కవితాధారలో అక్షరాలా అమృత మొలికించిన కాళిదాసు గురించి మాత్రం మనకేం తెలుసు - ఆయన సృష్టించిన పాత్రలు తప్ప. చదువుల తల్లి సరస్వతి, పద్మాసిని అయిన వీణాపాణి అనడంలో, ఆ సంకేతంలో, ఆ రూపచిత్రణలో, కాంతికిరణ స్పర్శ లోని పద్మవికసితశోభ, రాగలయ బద్ధమగు సుస్వనంలోని నాదోపాసన సమ్మిశితమై వున్నాయి. ఈ భరత ఖండపు నాగరికత, ఈ పుణ్యతీర్థాల చరిత్ర - తెలియనివారికి ఈ సంప్ర దాయంపై సద్భావంలేని వారికి, వాల్మీకి, కాళిదాసు, టాగూరు కవుల వలెనే కనబడతారుగాని వారి తేజః ప్రభావం అర్థం కాదు. వాల్మీకి రాముడు - దేవుడు. కాళిదాసు కావ్యం నభూతో నభవిష్యతి. తూర్పు పడ మరల మధ్య గోడలున్నాయని ఒక రంటే, అవి గోడలు కావు దినము లోని దివారాత్రములని ఎలుగెత్తి చాటాడు విశ్వకవి. ఆయన బెంగాలీ భాషలో వ్రాసిన కాసిని పేజీలపుస్త కమూ, దాని ఇంగ్లీషు అనువాదమూ 1912లో నోబెల్ బహుమాన కమిటీ వారు చూసి విస్తుపోయారు. ఇంత పల్చటి పుస్తకానికా ప్రయిజు ? - అనుకున్నారు. కాని, వలసదేశం నుంచి వెలువడిన యీ విశ్వగాన రవళి వారిని ఆశ్చర్యాంబుధిలో ముంచింది.

'గీతాంజలి' కి నోబెల్ బహుమతి రాగానే, ఆయనను అభినందించేం దుకు బోల్‌పూర్‌లోని శాంతినికేత నానికి పెద్దలూ ప్రముఖులూ ఒక సన్మాన సంఘంగా వస్తారు. అప్పుడు టాగూర్ అంటారు.... 'బెంగాలీ భాషలో యిన్ని సంవత్సరాలుగా ప్రజలు నాపుస్తకాలు చదవడంలేదా ? ఇప్పుడు కొత్తగా వారిగించేమిటి ? యూరప్‌లో గుర్తింపబడిన మీదట గాని, నా కవితకు విలువలేదా ?'.... (అంటారు టాగూర్) - ఆ వచ్చిన వారిని కొంచెము మందలిస్తూ, 1908 వంగవిభజన నాటికే, బంకిం చంద్రుని వందేమాతరం ప్రతి నోటా గానమై పలుకుతూండే నాటికే, టాగూర్

పాటలు బెంగాలంతా వున్నాయి. 'నా పదాల కూర్పుకి ప్రస్తుతించే వారి కరతాళధ్వనులకు వుబ్బిపోయేందుకు, యీ ప్రపంచం లోకి నేను కీర్తిని యాచించే బిచ్చగాని వలె రాలేదు. నా తల్లి, అనగా భారత మాత - కన్నీరు తుడవగల కృషి కంటె మరొక భాగ్యమేమున్నది ?' అంటూ రాజకీయాలలోకి దూకారు టాగూర్. విద్రోహకరమగు ఉప న్యాసాలు యివ్వవద్దని బెంగాల్ ప్రభుత్వం ఆయనకు ఒక లేఖ పంపు తుంది. దానికి ఆయన సమాధానం యివ్వరు. అప్పట్లో, ప్రభుత్వం ఆయ నను అరెస్ట్ చేసివుండవలసిందేగాని ఎందుకనో చేయలేదు – కొద్దిలో తప్పి పోయింది.

నోబెల్ బహుమతి పొందిన మీదట, లండన్‌లోని భారత కార్య దర్శి మొంటాగో, టాగూర్‌కి అభి నందన లేఖ పంపుతాడు. ఆపైన నైట్‌హుడ్ యిచ్చి గౌరవిస్తారు. జలి యన్‌వాలాబాగ్ దురంతాల అనం తరం లార్డ్ ఛెమ్స్‌ఫర్డ్‌కి ఒక అసమ్మతి లేఖ వ్రాస్తూ ఆ బిరుదుని తిరస్క రిస్తారు టాగూర్.

నవభారత నిర్మాతగా టాగూర్, భారతీయ ఆత్మస్వరూపాన్ని తన దేశ ప్రజలకు, ప్రపంచ ప్రజలకు సాక్షాత్కరింప జేశారు. ఎలాగంటే అప్పట్లో కలకత్తా నగరం భారత రాజ కీయాలకూ, సామాజిక చైతన్యానికీ కేంద్రం. 1912 దాకా మనదేశపు రాజధాని అదే. ఇప్పుడందరూ ఢిల్లీ పరిగెడుతున్నట్టే, అప్పుడు కలకత్తా వెళ్ళేవారు. బంకిమ్ చంద్రుని రచనా ప్రభావం భారతీయ భాషలన్నిటి మీదా కనబడుతుంది. రాజారామ మోహనరాయ్ సంఘసంస్కరణోద్య మం దేశమంతటా పాకింది. వివేకా నందుని గంభీరవాణి నలుమూలలూ దద్దరింపజేసింది. మైకేల్ మధుసూదన దత్, సిస్టర్ నివేదిత, ద్విజేంద్ర లాల్ రాయ్ - యిలా ఎందిరినో చెప్పవచ్చు. ఇదంతా వంగభూమిపై, తద్వారా నవభారతంపై పడ్డ ప్రభావం. ఈనాడు బెంగాల్ అన్నది, రేపు మిగతా భారతా వని అంటుంది - అనే మాట కొట్టి వేయదగదికాదు. అటువంటి వంగ ధరిత్రిలో, భారతీయులకి గంగాజల మెటువంటిదో, యీజిప్షియనులకు నైలునదీ, చైనీయులకు యాంగ్జీనదీ అటువంటివే సుమా - అనే సుసం పన్నమూ సత్సంప్రదాయబద్ధమూ అగు టాగూర్ కుటుంబంలో, ధ్యాన యోగంలో వున్నప్పుడు వొంటిమీద పాకే వుడతలనీ చేతులమీద వాలే పక్షులనీ సమహిత తత్త్వంతో చూడ గల ద్విజేంద్రనాథ్‌కి సోదరునిగా జన్మించాడు రవీంద్రుడు. సంగీత సాహిత్యాలు ఊయల వూపులుగా ఆయన బాల్యమంతా గడచింది. తనకు గురుతుల్యుడూ, ఆరాధ్యుడూ అయిన విద్యాపతివలె కవితారచన గావించాడు. పది పదిహేనేళ్ళ ప్రాయంలోనే,పాము నోటి ముందు కప్పచేసే నాట్యమే ప్రేమానుభవం అన్న చండీదాస్ గీతాలు, వైష్ణవ భావోద్దీపన, టాగూర్



తోని కవితాకన్యను మేల్కొల్ప సాగాయి. ఇరవై ఏళ్ళు నిండక పూర్వమే యింగ్లండు వెళ్ళాడు. అక్కడ వున్నప్పు డాయనకు ఐసి యస్. పాసవాలనీ, బారిస్టర్ అవాలనీ అనిపించలేదు. వేషభాషలలో గాని, ఆహారవిహారాలలో గాని, నిత్యకృత్యపు మాటాపలుకూతో గాని అక్కడి ఆచా

రాలేవీ వెంటబెట్టుకు రాని రవీంద్రుడు. అనాటి వారిలో సంచలనం కలిగించడం సహజం. అప్పటికే ఆయన మనసులో ఒక ఊర్వశి ఉదయిస్తోంది.

ఋగ్వేదంలో - ఊర్వశి ప్రసక్తి ఉంది. ఆమె పురూరవునితో అంటుందట.... నేను నీవద్దనుంచి ఈ మహా సృష్టిలోని మొదటి ఉదయంలా వెళ్ళిపోయాను.... మలయానిలం వంటి నన్ను నీవు పట్టుకోలేవు ... ఊర్వశి ఇంద్రుని దర్బారులో అప్సరస అంటారు. ఆర్యుల ఇతిహాసానికి ప్రతిరూప మనదగు గ్రీకు ఇతిహాసంలోని అఫ్రొడైట్‌ని - రోమనులు వీనస్ అన్నారు. ఈమె సముద్రపు నురగ నుంచి జన్మించిందని ప్రతీతి. గ్రీకు భాషలోని ఈవోస్ .... సంస్కృతంలో ఉష - అయింది, అనగా ఉదయ సంధ్య. కాళిదాసు విక్రమోర్వశీయంలో ఊర్వశిగా అమరత్వం పొందింది.

రవీంద్రుడు ప్రమోగించినది విశ్వవీణ. వీణానాదంలోని శబ్దమాధురిని ఆనందించేందుకు ఎటువంటి ప్రశాంత చిత్తం కావాలో రవీంద్రుని కవితా చిత్రమాలలోని రసాస్వాదనకు అటువంటివి నిర్మల మనోమయ వాతావరణమే కావాలి. తన కంటుకున్న మట్టి కనబడనీయని బూడిద బట్టల బాటసారి, తన ప్రభువు పూదండ నుంచి పాన్పుపై రాలిన రేకులు వెతికే పడతి, శూన్య గృహంలో కూర్చుని, స్వామిరాక కోసమై ఎదురు చూసే సఖి, లేక, సేవకుడు - ఇటువంటి చిత్రణలో మనకు కనబడేది. మానవాత్మ భగవంతుని పిలిచే పిలుపు - అని వై బి ఈట్స్ 1912 లో 'గీతాంజలి'కి పరిచయం వ్రాస్తూ అన్నాడు.

వైష్ణవ సంప్రదాయంలో ప్రకృతి పురుషులే జీవాత్మ పరమాత్మలు. జీవాత్మ, పరమాత్మ కోసం జరిపే అన్వేషణే జీవితం. 'లవర్స్ గిఫ్ట్'లో అంటారు టాగూర్ :

'నిన్న రాత్రి తోటలో, నీకు, యౌవన మధుపాత్ర నందించాను. పాత్రనీ పెదవుల వద్దకు చేర్చుకు, అరనిమీలనేత్రాలతో చిరుహాసరేఖలు నీవు వెదజల్లగా, నీ మేలిముసుగు తొలగించి, కురులు సర్ది, నీ గంభీర సుందరవదనం నా గుండెలపై నిలుపుకున్నాను. ప్రపంచ సుషుప్తిపై చంద్రుని స్వప్నకాంతి పరవళ్లు తొక్కింది.

'ఈ ఉదయం మంచుతడిలో పరిశుద్ధవై, ధవళవస్త్రధారిణివై, పూసజ్జ నిండా పూలు నింపుకు, దేవాలయానికి వెళ్తున్నావు. నిర్జనపథములో చెట్టు కానుకు అధోవదనుడనై నిలబడ్డాను నేను.'

పై చిత్రణలో నరనారీ హృదయ స్పందన ద్వారా జీవుడూ దేవుడూ లీలగా కనబడతారు. పడవని కొయ్యకు కట్టివేసే తాడే ముందుకు లాగేందుకు ఉపయోగపడుతున్నట్టు యింజనూ రైలు బద్దీలూ వున్నా స్టేషనులు లేని ప్రయాణం సాధ్యం కానట్లు, వాక్యంలోని ప్రతి అక్షరమూ దేనికది వర్ణక్రమంలో చదివితే వాక్యం బోధపడనట్లు సామరస్యమూ

సృజన లేనిదే జీవికకు నిండుతనం లేదంటారు టాగూర్. సృజన అనేది ప్రతిమనిషిలోనూ సహజముగా వుండే చైతన్యభావం. అది లోపించినప్పుడు సచేతనములకీ అచేతనములకీ అట్టే తేడా కనిపించదు. మనుషులూ వస్తువులూ ఒకేస్థాయిలో కనబడతాయి. మనచుట్టూగల లోకంతో మనకుగలది, వ్యక్తిగతమైన బాంధవ్యము. మన ఆనందవిషాదాలకు హేతుభూత మీ ప్రపంచం. అంచేత ప్రపంచంతో నాకేం పని అని పిచ్చివాళ్ళొక్కరే అనగలరు. పోతే, ఈ ప్రపంచంలోని విషయ బాంధవ్యాలన్నీ సత్యము అనే సూత్రానికి కట్టుబడివున్నాయి. వాస్తవబాంధవ్యాలన్నీ హేతువు అనే జ్ఞానానికి కట్టుబడి వున్నాయి. వ్యక్తిబాంధవ్యాలన్నీ ప్రేమ అనే ఆనందానికి కట్టుబడివున్నాయి. మనం ఈ ప్రపంచంలో వస్తువులమూ, విషయాలమూ కాదు - వ్యక్తులము. కాలప్రవాహంతో కొట్టుకుపోవలసిన వారంకాదు. కాలప్రవాహంతోబాటు యీదుతూ, ఏ తీరం చేరుకోవాలో తెలుసుకోవలసిన వారము. అదే సృజనలో గల లక్షణం.

రెండవది సామరస్యం. పాశ్చాత్య జీవితంలోని స్పర్థకూ, సంఘర్షణకూ గల మూలకారణం, వారి జీవనవిధానంలో గల పోటీపద్ధతి. అసలు యీ పోటీపద్ధతిలోనే అధికార సోపాన పంక్తివుంది. అధికారమనేది ఒక దప్పికవంటిది. ఆ దప్పిక తీరడమంటూ వుండదు. మానవ స్వభావంలోనే ఒకవైపు అధికార తృష్ణ, మరొకవైపుప్రేమ భావమూ వున్నాయి. ప్రేమ మార్గాన పయనించే వారికి ఆనందమనే పూలవనం కనబడుతుంది. అధికారపు బాట కొండగుహాలోని అంధకారంలోకి తీసుకు వెళ్తుంది. మనలో సామరస్యం పెంపొందించుకోడం ద్వారానే ప్రేమదీపం వెలిగించగలుగుతాం - దానికి నిరంతర సాధన కావాలి.

వెలుగుతున్న దీపం మూడు విధాల ఆరిపోవచ్చు. చమురులేక, గాలి వీచి, దీపం పగిలీ! చమురు పోయవచ్చు; ఆరినవొత్తి మళ్ళీ వెలిగించవచ్చు; కాని పగిలినదీపం ఎందుకూ కొరగాదు, అయితే వెలుగుతున్నంత సేపూ దీపం, చుట్టూ వెలుతురు చిమ్మడమేగాక తన ఉనికికూడా తెలియజేస్తుంది.

నేను పాడుదామనుకున్న పాట యీనాటివరకూ పాడటం జరగలేదు. తంత్రులు సరిచేసుకోవడంలోనే రోజులన్నీ గడిచాయి. అవును - సమయం దగ్గిరకొచ్చింది.

పదాలు సరిగా పడటం లేదు. గుండెలు పిండే వేదన ఒక్కటే మిగిలింది.

మలయానిలం నిట్టూరుస్తున్నది. కాని, పుష్పమింకా వికసించలేదు.

ఆయన మోము నేను చూడలేదు. కంఠం నేను వినలేదు. నా యింట్లో నేనుండగా వీధిలోనుంచి ఆయన మృదుచరణాల అలికిడి మాత్రం వెవులబడింది.

రోజంతా, ఆయనకు పుష్పాసనం తయారు చేయడంలో గడిచిపోయింది. దీపం ముట్టించకుండానే ఆయనను లోనికి ఎలా రమ్మనగలను ?

'ఆయన దర్శన భాగ్యంకోసమై వేచివున్నాను కాని, ఆ కోరిక తీరే దెప్పుడో ?'

రవీంద్ర కవీంద్రులు ఆవిధంగా మానస వీణపై విశ్వమోహన గీతిక నాలపించారు. గురుశిష్య బాంధ వ్యంలో ఒక నూతనాధ్యాయానికి నాందీవాక్యం పలికి, శాంతి నికేతనంలో విశ్వభారతిని నిర్మించారు. ఇప్పుడైతే అడుగడుక్కీ ప్రచారోద్వే గంతో కూడిన శాంతి పావురాలూ, శాంతిసందేశాలూగాని రవీంద్రనాథ్ టాగూర్ ఏనాడో అన్నారు : రక్త సాంద్రానికి ఆవల, శాంతి తీరమెక్కడ వున్నదో, ఎంత శక్తిమంతమైన టెలిస్కోపూ చూపలేకుండా వున్నదని.

అందుకు కారణం ఒక్కటేనంటారు టాగూర్ - అధికారంతో కూడిన ఆత్మ గర్వం. అధికారశక్తి అనేక నాగరికత లకు స్వస్తివాచకం చెప్పిందనీ. ఆ శక్తినిగాక సామరస్యాన్ని నమ్ము కుంటే, యింతటి రక్తపాతం సంభ వించదనీ సర్వమానవ సౌభ్రాతృత్వ నినాదానికి ముందు ఆత్మపరిశీలన అవసరమనీ అంటారాయన.

నవభారత నిర్మాతగా రవీంద్రనాద్ టాగూర్ ఏం చేశారు ? ఈ నిద్రాణ జాతిని ఎలా మేల్కొల్పారు :

"ఎక్కడైతే మనసుకి భయసం కోచాలు లేకుండా, ధైర్యంగా తల ఎత్తుకు తిరగగలమో,

ఎక్కడైతే విద్యావిజ్ఞానాలు అడ గటమే తడవుగా లభ్యమవుతాయో,

ఎక్కడైతే లోకం స్వజన సంకు చితపు గోడలతో ముక్కచెక్కలుకాదో,

ఎక్కడైతే సత్యకుహరం నుంచి మాటలు వెలువడుతాయో,

ఎక్కడైతే నిర్విరామకృషి విశిష్ట పథం వైపు చేతులు చాపుతుందో,

ఎక్కడైతే నిష్కల్మష హేతుజ్ఞాన వాహిని నిర్జీవపుటలవాటు అనే ఎడారి యిసుకలో ఇంకిపోదో,

ఎక్కడైతే ఈ మనసు ఆలోచన, ఆచరణవల్ల సువిశాలమవుతూ, నీ వల్ల ముందుకి నడవ బడుతున్నదో,

ఆ స్వాతంత్ర్య స్వర్గసీమవైపుగా ప్రభూ, ఈ దేశాన్ని మేల్కొల్పు."

రచన : ఆగస్టు 1968



మన బ్రతుక్కి ఒక ఉద్దేశం, ఒక లక్ష్యం కల్పించబడితే గాని అది జీవిత మనిపించుకోదు. — రాఫెల్

ఈ లోకంలో ఎవరు సుఖజీవ నులు ? భయాలు వీడి, ఆత్మగౌర వాన్ని నిలబెట్టుకో గల ధీరులు.

— పాటర్సన్

ఈ స్కూలు పాఠాలు నా అసలు చదువుని చెడగొట్టలేక పోయాయి.

— మార్క్‌ట్వేన్



**1776 జులై - ఆ నాలుగు రోజులు**

# స్వాతంత్ర్య పత్రం

అమెరికాలోని వలసల తిరుగుబాటుని అణిచివేయడానికి సిద్ధంగా ఉంది బ్రిటన్. స్వాతంత్రం ఒకరిచ్చేదికాదు - దేవుడిచ్చినది. పన్నులువేసే హక్కుతో బాటు ప్రజాసంరక్షణ బాధ్యత కూడా పాలకుల పున్నది - అని గుర్తుచేస్తూ, గుండె నిబ్బరంతో స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదింపనున్నాయి పదమూడు రాష్ట్రాలూ.... ఇక చదవండి

అనుమానము సోకినవారిని రాజ విద్రోహులుగా బందీచేసి న్యాయవిచారణకు దూరప్రదేశాలకు పంపించివేశారు. వలస దారుల ఆయుధాగారాలనీ, వారివద్ద గల మందు గుండు సామగ్రినీ వశం చేసుకోవలసిందనీ, ఈ తిరుగుబాటుదారకి నాయకులైన జాన్ హాన్ కాక్‌నీ శామ్యూల్ యాడమ్స్‌నీ బందీచేయవలసిందనీ ఆదేశిస్తూ 1775 ఏప్రిల్ 19 వ తేదీన జనరల్ గేజ్ తన పటాలాలను బాస్టన్ మీదకు పంపాడు. ఈ విషయం ముందే తెలుసుకున్న వ్యవసాయ దారులు, రోడ్డు మీద రాకపోకలు నిల్చిపోయే విధముగా మార్గావరోధాలు ఏర్పాటు చేశారు. జనరల్ గేజ్ సైనికులు ఈ అవరోధాలకు ఆగ్రహావేశులై నిరాయుధులయిన రైతులపై నిర్దాక్షిణ్యంగా తుపాకులు పేల్చారు.

లెక్సిన్ గ్రామము వద్ద రోడ్డు దుమ్ములో గౌరవనీయులైన రైతు పెద్దలు కూలిపోయారు. కాంకార్డు వంతెన వద్ద కూడా అదే అమానుష చర్య జరిగింది. ఘాతుకంగా వధించబడ్డారు అమాయకులైన రైతులు. తమ తండ్రుల మరణానికి ప్రతీకార జ్వాల, తనయుల చేత ఆయుధాలు పట్టించింది. చెట్లచాటున గుట్టల వెనక పొంచివుండి సుమారు యిరవై మైళ్ళ ప్రదేశాన్ని కాపలాకాస్తూ, ముందుకు రానుంకిస్తున్న సైనికులపై తుపాకులు పేల్చారు రైతుయువకులు. మూడు గంటలసేపు జరిగిన ఈ యుద్ధములో రాజసైనికులు భీతిలి, పలాయనము చిత్తగించారు. ఈవిధముగా ప్రారంభమయింది ప్రజల ఉద్యమం. గ్రామీణ ప్రజలు ఆ రోజును ఘాతుక చర్యల దినముగా పరిగణించారు. బాలింతలైన స్త్రీలను నగ్నంగా వీధులవెంట తిప్పారనీ, మూల కూచున్న ముసిలివాళ్ళని నిర్దాక్షిణ్యముగా కాల్చివేశారనీ ఒక గ్రామీణ ప్రచారకుడు చెప్పడము మొదలెట్టాడు. బ్రిటిష్ వారు తమ సైనికులని వలసదారులు ఎంత అమానుషముగా చిత్రవధ చేసినదీ ప్రచారము చేయడము మొదలుపెట్టారు.

జనరల్ గేజ్ జూన్ పన్నెండవ తేదీన తన ఆజ్ఞాపత్రములో "తప్పొప్పులు ఎవరివైనప్పటికీ న్యాయమూ క్రమత, తప్పక గౌరవింపదగినవి. శాంతి భద్రతలు సుస్థాపన ప్రథమ కర్తవ్యము. జాన్‌హేన్‌కాక్. శామ్యూల్ యాడమ్స్ తప్ప మిగతా తిరుగుబాటు దార్లనందరినీ, ఆంగ్ల ప్రభుత్వము మన్నించడానికి సిద్ధంగా వుంది" అని ప్రకటించాడు.

కేంబ్రిడ్జి ప్రజలు తమ ప్రయత్నములో తాము వున్నారు. కొద్ది రోజుల తర్వాత బంకర్‌హిల్ వద్ద వారు రాజసైనికులని ఎదుర్కొన వలసి ఉంటుంది. ఈలోగా పదమూడు వలసల నుంచి ముఖ్యులైన వారు ఫిలడల్ఫియాలో సమావేశమవుతున్నారు. ఇరుగుపొరుగువారు జాన్ యాడమ్స్‌ని తమ ప్రతినిధిగా ఎన్నుకుని తమ తరఫున మాట్లాడమన్నారు. యాడమ్స్, బొస్టన్‌లోని తన కార్యాలయాన్ని ఏనాడో మూసివేశాడు. ప్రఖ్యాత న్యాయవాదిగా అతని సంపాదన ఏనాడో వూడ్చి పెట్టుకుపోయింది. ఆ తరువాత లాభదాయకమగు వుద్యోగాలు అనేకము అతనికి సూచించారు. కాని వాటిని అతను ఆమోదించలేదు.

'రాజకీయాలనగా అగ్నిగుండాల మధ్య నుంచి పరుగులు తీయడం. పాదాలు భగభగ మండుతాయని తెలిసి కూడా కాళ్ళకి జోళ్ళుకూడా లేకుండా ఒక్కొక్కతడవ పరుగు తీయవలసి వస్తుంది. జోళ్ళకోసం కనిపెట్టుకుని కూచునేపాటి వ్యవధి వుండదు' అన్నాడు యాడమ్స్ తన న్యాయవాద వృత్తికి స్వస్తి చెపుతూ.

ఒక వుదయంవేళ బంకర్‌హిల్ వద్ద యుద్ధము ప్రారంభమైంది. తుపాకి కాల్పుల ధ్వని ఎబిగైల్‌కి వినపడింది. పిల్లల్ని వెంట తీసికొని తమ యింటికి వెనక భాగానవున్న గుట్టఎక్కి చూడగా, యుద్ధరంగంలో కమ్ముకుపోయిన నల్లటి పొగ వారికి కనబడింది. ఇంట్లోకి వచ్చిన వెంటనే జాన్‌కి లేఖ వ్రాసింది. "ఇన్నాళ్ళుగా ఎదురుచూస్తున్న రోజు యివ్వాళ రానే వచ్చింది. నేటితో అమెరికా భవిష్యత్తు తేలిపోతుంది..." ఆమె ఇలా రాయడము ముగించకుండానే, ఎవరో ఒక వార్తాహరుడు యింటి ముందు ఆగి, కాసినిమంచి నీళ్ళుకావాలని అడిగి పుచ్చుకు తాగి, ప్రసంగవశాన యుద్ధ వార్తలు చెప్పిపోతూండేవాడు.

ప్రఖ్యాత నాయకులయిన గేజ్, హౌవ్, క్లింటన్, బర్గానీ ఈ నలుగురూ మూడు తడవలు బంకర్‌హిల్‌పై దాడి జరిపారు. సైనిక శిక్షణ ఏ మాత్రమూ లేని తిరుగుబాటుదార్లు వీరిని తిప్పి తిప్పి కొట్టారు. ఏదో రీతిని బంకర్‌హిల్ వశపరచుకోవాలని బ్రిటిష్ సైనికాధికారులు తమ సైనికులకు ఆజ్ఞాపించారు.

ఎబిగైల్ తన భర్తకి ఇలా వ్రాస్తోంది. "నేను ఇప్పుడే విన్నాను, మన ప్రియమిత్రుడైన డాక్టర్ వారెన్ తన జన్మభూమి కోసమై కడు ధైర్యముతో పోరాడుతూ వీరమరణము

హొందాడని! ఇంకా ఎందరెందరు కూలిపోయారో ...."

ఫిలడల్ఫియాలో జాన్ యాడమ్స్ ఆమె వుత్తరాన్ని దిగులుతో అవమానంతో తన జాతిప్రజల ధైర్య సాహసాలకి గర్వంతో చదువుకున్నాడు. "సామాన్యవేళలగాక ఇటువంటి క్లిష్టసమయంలోనే ప్రజలకు నిశ్చలత, దీక్ష అలవడుతుందనుకుంటాను. కష్టాలు, ప్రమాదాలు ఎదురవుతున్నపుడు, మనసు కొంచెం రాటుదేలి, మన స్థిరసంకల్పమే చుక్కానిగా ముందడుగు పడుతుంది" అని జవాబులో రాశాడు.

తన ఇరుగు పొరుగు చూపుతున్న ధైర్యసాహసాలకి జాన్ యాడమ్స్ కెంతో సంతోషముగా వుంది. ప్రియ స్నేహితుడైన జోసెఫ్ వారెన్ ఈ విధముగా మరణించడము ఎంత దురదృష్టమో అనిపించింది. ఈ నిరర్ధక త్యాగానికి తగు ఫలితమున్నదా? ఆయుధ సంపత్తితోను సుశిక్షతతోను రానున్న ప్రమాదాన్ని ఎదుర్కొనేందుకు సంసిద్ధులు కాకపోవడానికి కారణము ఫిలడల్ఫియాలోని ప్రతినిధుల జాప్యమే!

భార్యకు తెలుపగల శుభవార్త సైనికాధ్యక్షుని ఎన్నిక. యాడమ్స్ పట్టుదల చూపినమీదట 1775 జూన్ పదిహేనవ తేదీన సమర్ధుడు సహృదయుడు సాహసోపేతుడు అయిన జార్జి వాషింగ్టన్‌ని సర్వ సైన్యాధ్యక్షునిగా కాంగ్రెసు ప్రతినిధులు ఎన్నుకున్నారు. 1775 జులై మూడవ తేదీన న్యూ ఇంగ్లండులోని విప్లవదళాలకు ఆధిపత్యం వహించాడు వాషింగ్టన్. అక్కడి విప్లవ శిబిరాలు పరీక్షించి వస్తూ, బ్రెయిన్ - ట్రీ వ్యవసాయ క్షేత్రంవద్ద ఆగి ఎబిగైల్‌ని పలకరించాడు. భర్తకు ఆమె, జార్జి వాషింగ్టన్ గురించి తనకు ఏర్పడ్డ అనుభూతిని ఈవిధముగా వ్యక్తం చేసింది: "జనరల్ వాషింగ్టన్ ఒక ధీరవరేణ్యుడు. అతని నిండుతనములోను దర్జాలోను సానుభూతీ, సహృదయము వున్నాయి. సత్పురుషుడైన ఈ సైన్యాధికారిలో సౌజన్యమూ సాహసమూ రెండూ మిళితమైకానవస్తాయి".... బంకర్‌హిల్ వద్ద తిరుగుబాటు విఫలమైంది. ప్రజలు వోడిపోయారు. బ్రిటిష్ వారి ఆగ్రహానికి గురి అయింది బాస్టన్ నగరము. పట్నము యావత్తు ఒక సైనిక శిబిరముగా మారిపోయింది. వ్యాపారపు ఓడలు బాస్టన్ రేవులోకి రావడము లేదు. ప్రజలని ఆకలిబాధకి గురిచేసి బుద్ధి చెప్పాలని బ్రిటిష్‌వారి ప్రయత్నము. జనాభాలో చాలా భాగము అప్పటికే ఆకలిబాధతో అలమటించిపోతున్నారు. వ్యాధులకి నిరుద్యోగముకూడా తోడైంది. బెస్తవారికి పనిలేకుండా పోయింది. వారి జీవనోపాధి నశించిపోయింది. రేవులు, నౌకాస్థలము, నిరర్ధకము లయాయి. వచ్చే సరకూ లేదు. వెళ్ళే సరకూ లేదు. సమస్తమూ స్తంభించిపోయింది. తిండీ, బట్టా మందులూ, వంటచెరకూ ఈ నాలుగూ లభ్యముగాక ప్రజలు కటకట లాడుతున్నారు.

బ్రెయిన్‌ట్రీ క్షేత్రములోని ఎబిగెల్ తనకి తాను నూలు వడికి, గెట్టలు నేసుకొంటోంది. "పత్తి, వున్నీ దొరకడము కూడా చాలా కష్టముగా వుంది. ఆహారధాన్యాల ధర ఆకాశాన్ని తాకింది. కాఫీ, పంచదార, మిరియాలు - ఈ మూడూ మాయమై పోయాయి. అదృష్టవశాత్తూ పాలు, ఖీరకాయలు మటుకు పుష్కలముగా లభిస్తున్నాయి" అని రాసింది ఎబిగైల్. తన చెవిని పడ్డనాటినుంచి ఎప్పటికప్పుడు యుద్ధ వార్తలూ తత్పరిణామాలూ, భర్తకి తెలియపరుస్తూండేది ఎబిగైల్. ఆగ్రహావేశులైన రైతు బృందాలనుంచి శిక్షణాయుత మగు ప్రజాసేనని రూపొందించాలని సర్వసైన్యాధికారి అయిన జార్జి వాషింగ్టన్ అన్నాడు.

"గత ఆగస్టులో బాస్టన్‌పై దాడి జరుగునున్నదనే వదంతితో ప్రజలు పట్నము వదలిపెట్టి పోవడానికి సంసిద్ధులయారు. బాస్టన్ అంతా గందరగోళముగా వున్నది. ప్రతి వాళ్ళూ సామాను సర్దుకు, బళ్ళమీద వేసుకుని ఎక్కడికో పోతున్నారు. బళ్ళవాళ్ళు అతిదారుణంగా కిరాయి అడుగుతున్నారు. ఒక చిన్న పెట్టె మోసుకెళ్ళేందుకు యెనిమిది డాలర్లు. పెద్ద బరువైతే నూరు డాలర్లు. మన దేశీయులలో ఇంతటి స్వార్థబుద్ధీ - నీచత్వమూ వున్నవా అని ఆశ్చర్యము కలుగుతోంది. మనము సిగ్గుపడవలసిన విషయము ప్రజల బాధల పెరుగుదలతో తమ లాభాలు పెంచుకోవాలని చూసే దొంగవ్యాపారులూ కుత్సితులూ సంఖ్య చెప్పనలవిగాకుండా వున్నది. పొరుగువాని కష్టమే లాభమను పరిస్థితి ఏర్పడింది. ప్రజాసేవకులమని డాంభీకంగా చెప్పుకునే వారు తమ దేశాన్ని శత్రువుకి అమ్మడానికి సిద్ధముగా వున్నారు. తమ పలుకుబడితో స్వంత లాభము పెంచుకుంటున్నారు. దురాశా, దుశ్చింతా, దుర్బుద్ధీ ఈమూడే తాండవిస్తున్నాయి. మానవస్వభావము అన్నిదేశాలలోనూ, ఒకటేనేమో ?"

ఏడువేలు సంఖ్యా బలంగా గల బ్రిటిష్ సేన బాస్టన్ నగరములో స్థిరపడివుంది : ఆహారము, వంటచెరకు వారికీ కరువౌతున్నవి. జనరల్ బర్గానీ ఒక విశాలభవంతిలో విడిది దిగాడు. పుష్పవాటికను ధ్వంసం చేసి పందులు పెంచుతున్నారు. ప్రాచీన ప్రార్థనాలయాన్ని గుర్రపుశాలగా మార్చారు. పురమందిరాన్ని జార్జి వాషింగ్టన్ పై వికటనాటకము చూపే ప్రదర్శన శాలగా మార్చివేశారు.

ఎబిగైల్ అక్టోబరులో భర్తకు వ్రాస్తూ అంది : "ఈ నెల ఇరవై అయిదో తేది మన వివాహదినము - ఈ పదకొండు సంవత్సరాలలోనూ కనీసము సగకాలమైనా మనము ఒక చోట కలిసి వుండలేకపోయాం."

యుద్ధ ప్రభావ ఫలితముగానే కరువు కాటకాలు విజృంభించాయి. మశూచి, అతిసారమువంటి అంటు వ్యాధులు సైనిక శిబిరాలకు వ్యాపించాయి. బాస్టన్ నగరములో కొన్ని

పెందల కుటుంబాలు వీటివల్ల నష్టపోయాయి. ఎబిగైల్ నలుగురు పిల్లలూ, పడక వేశారు. "మన ఇల్లు ఈనాడు ఆస్పత్రివలె వున్నది. ఇన్ని చావులూ ఇన్ని రోగాలూ శతవృద్ధులు కూడా తమకు ఎరుకలో లేవంటున్నారు," అని వ్రాసింది ఎబిగైల్. "ఎంత లోపభూయిష్టమైనప్పటికీ, ఎంత పతనము చెందినప్పటికీ మానవ ప్రకృతిలో ఉన్నత శిఖరాలు చేరుకోగల సామర్థ్యముకూడా వున్నది. ఈ విషయము మరిచిపోకు. పశువు కంటే మనిషినీ సామాన్యునికంటె సజ్జనునీ, వున్నతునిగా చేస్తున్నది స్వభావ నైజం కాదు. ఆ వ్యక్తి పొందుతున్న విద్యాశిక్షణ - ఈవిద్య అనగా పుస్తకపఠన మొక్కటే కాదు. ఏ శక్తులు, సద్గుణాలు క్రమశిక్షణకి ప్రాతిపదికలని ప్రారంభపాఠాలలో వ్యక్తులు తెలుసుకోగలుగుతారో ఆ శక్తులూ సద్గుణాలూ వారికి మహోన్నతమూ అపూర్వమూ అయిన ప్రపంచాన్ని పరిచయము చేస్తున్నాయి" అని వ్రాశాడు యాడమ్స్ తన భార్యకు.

కాంగ్రెస్ సభలోని మితవాదులు ఎప్పటికప్పుడు తన సూచనలకు ఆక్షేపణ తెలుపుతున్నపుడు జాన్ యాడమ్స్ ఇలా అనేవాడు. "ఈనాడు







నేను నేలను చదును చేస్తున్నాను. నాకాలమంతా ఈ నేల చదును చేయ డానికే వ్యయము కావచ్చు. పసరిక మొలిచిన నేలమీద పంటపండి, అది బళ్ళకెత్తడము ఏనాటికో !"

ఆ నెల కానెల అతని శ్రమ, పరి శ్రమ తీవ్రం కాజొచ్చాయి. ఉదయము నాలుగు గంటలకి లేచి, అర్ధరాత్రి దాకా కష్టబడేవాడు. ఈ కష్టానికి ఫలిత మేమిటి? ఈ కష్టపడడమువల్ల మిగిలినదేమిటి ? ప్రయోజనాన్ని అన్వేషించవలసిన భారము తనది కాదు. అది కాలమే నిర్ణయించాలి. తనకు ఈ శ్రమ ఫలితము ఏరూపం లోనూ దక్కకపోవచ్చు. కాని తన దేశము తన ప్రజలూ కష్టఫలితాన్ని అనుభవిస్తారు. ఇది వారి కోసము. ఇందులో తను కాంక్షించదగ్గది ఏమీ లేదు.

బాస్టన్ ప్రాంతములో సంభ విస్తున్న పెద్ద పెద్ద మార్పులను ఎబి గైల్ భర్తకి తెలియపరుస్తూండేది. పట్నం తొమ్మిది నెలలు శత్రు ఆక్ర మణలో వున్న మీదట విప్లవ సేన లలో కొంచెం కదలిక బయలుదేరింది. అప్పటికి గాని విప్లవసేన శత్రువుని ఎదుర్కొనేందుకు పూనుకోలేదు. సైని కులు తమ బాధ్యతని విస్మరించి, పారిపోవడమూ, అల్పకాలపు రిక్రూట్ మెంట్లూ విప్లవ సేనను బలహీన పరు స్తున్నాయని వాషింగ్టన్ గ్రహించాడు. జనవరి సగము గడిచేసరికి, మళ్ళా సైనికులు సేనలో చేరడము ప్రారం భించారు. టికోండెరగో కోటలో పెద్ద పెద్ద ఫిరంగులు ఫిబ్రవరి నాటికి ఏర్పాటు చేశారు. మంచుతో కప్ప బడిన నిర్జన ప్రదేశము గుండా యాభై పెద్ద ఫిరంగులను అతి ప్రయా సతో స్లెడ్జిబళ్ళ మీద వేసి తీసు కొచ్చారు.

1776 మార్చి నెల మొదటి మూడు రోజులూ వాషింగ్టన్ సేనలు, బాస్టన్ నగరానికి రెండు మైళ్ళ దక్షి ణాన గల డార్చెస్టర్ పర్వతశ్రేణులపై అతి రహస్యముగా తమ రక్షణ శిబి రాలు ఏర్పరచుకున్నాయి. మార్చి నాల్గవ తేదీ సోమవారమునాడు రాత్రి రెండువేల మంది సైనికులు ఆ కొండల మీద కందకాలు ఏర్పరచు కున్నారు. ఆ రాత్రి పది గంటలయే సరికి రెండు కోటలు ఏర్పడ్డాయి. పెద్ద ఫిరంగులను ఎడ్లమీద దొడ్డిదారుల ద్వారా తీసుకొచ్చి అక్కడికి చేర్చారు. తెల్లవారుజాము మూడు గంటలకి ఫిరంగులు వాటి వాటి స్థానాలలో అ మ ర్చ బ డ్డా యి. ఫిరంగులు పేల్చేందుకు మనుషులు కూడా తయారుగావున్నారు. శత్రువుని తప్పు దారి పట్టించేందుకు తాము చేస్తున్న ఈ ప్రయత్నము శత్రువు గ్రహించ కుండా వుండేందుకు గత రెండు రోజులుగా రాత్రింబవళ్లూ పట్నపు వుత్తర పశ్చిమవైపుల నుంచి వాషింగ్టన్ సేనలు బ్రిటిషు పటాలాలపై నిర్వి రామంగా తుపాకులు పేలుస్తున్నాయి.

"ఒక్కొకక్క ఫిరంగి పేలినపుడల్లా ఈ ఇల్లు పునాదులతో కదులుతోంది .... నేను రాత్రి పడుకునే సరికి

పన్నెండు గంటలయింది. ఒంటి గంట దాటిందో లేదో మెళకువ వచ్చింది. తుపాకులు నిర్విరామముగా పేలు తున్నాయి. ఫిరంగులు గర్జిస్తున్నాయి. ఎవరు ఎవరి మీద పేలుస్తున్నారో బోధపడడము లేదు. పోయినరాత్రి విప్లవ సేన డార్ ఛెస్టర్ కొండ పట్టు కున్నదని అంటున్నారు. నాలుగు వేల సైన్యము అందులో పాల్గొన్నదట. పట్నం చుట్టూ నౌకలు వచ్చి చేరు తున్నాయి'' అని ఎబిగైల్ మార్చి అయిదవ తేదీ మంగళవారమునాడు వుదయము భర్తకు వ్రాసింది. యుద్దం రెండువారాలు నడిచింది. బొస్టన్ నగరమంతా అల్లకల్లోల మయింది. డార్ ఛెస్టర్ కొండమీది పెద్ద ఫిరంగు లను ఎదిరించడము అసాధ్యమైన విష యము గనుక, పట్నంనుంచి తిరోగ మించే స్థితికి వచ్చాడు శత్రువు. విప్లవ ఫిరంగులు కొండచుట్టూ అమర్చబడి వున్న మీదట తాను ఈ పట్నాన్ని తన ఆధీనంలో వుంచుకోలేనని గ్రహిం చాడు. స్వల్ప నష్టముతో సేనను ఉప సంహరించుకోవడం క్షేమదాయకమని మొదటివారములోనే నౌకా సిబ్బందికి తెలియబరిచాడు. ఈలోగా మూడు రోజులపాటు బ్రహ్మాండమైన తుఫాను చెలరేగింది. హా నౌకా బలం నిస్స హాయముగా బొస్టన్ చుట్టూ తారట్లా డింది ఆ మూడురోజులూ. 1776 మార్చి 17 వ తేదీ ఆదివారమునాడు ఏడువేల సేనతో బ్రిటిష్ నౌకాబలము బొస్టన్ నగరాన్ని వొదిలివేసింది. స్వల్పసంఖ్యా బలము గల ప్రజాసేనకు అది ప్రథమ విజయము. బ్రిటిష్ సేనల ఉపసంహారణకు వాషింగ్టన్ యుద్ధ తంత్రము కారణమవడముతో అతని పేరు ప్రఖ్యాతులు ఇనుమడించాయి. స్వాతంత్ర్య సమరానికి నూతనోత్తేజం లభించింది. కాని ఎబిగైల్‌కి అంతగా సంతోషం కలుగలేదు, ఇది తాత్కాలిక విజయమని ఆమెకీ తెలుసు; అసలు పోరాటం ముందు వున్నది. ఉపసం హరింపబడిన ఈ మహాసేన మరొక చోట ఇంతకంటె ధాటిగా ప్రయోగింప బడవచ్చు. న్యూయార్క్‌పైదాడి సల్ప వచ్చు. లేదా, ఫిలడల్ఫియాపై విరుచుకుపడవచ్చు; ఏమైనా శత్రు సేనలు పట్నపు పొలిమేరలు దాటి వెళ్ళి పోవడముతో మనసు కొంచెము తెరిపినపడింది.

డాక్టర్ ఫ్రాంక్లిన్ ప్రతినిధిగా ఎన్నికైన మీదట యాడమ్స్ ఆమెకి ఇలా వ్రాశాడు: "డాక్టర్ ఫ్రాంక్లిన్ స్వభావములో విశిష్టతా విలక్షణా కన్పిస్తాయి. తను నాయకునివలె సంచరించడు. పక్కవారితో కలిసి పోతాడు. ఎంతటి సాహసవంతమైన కార్యాన్నయినా సరే, అది న్యాయమని తోస్తే, ఆచరణలో పెట్టేందుకే మాత్రము వెనుకాడడు. మనలో చాలా మందికి మనోనిశ్చయము, సంకల్ప బలమూ లేవని ఆయన ఉద్దేశము''

ఒకసారి డాక్టర్ ఫ్రాంక్లిన్, బ్రెయిన్‌ట్రీ వ్యవసాయ క్షేత్రానికి వెళ్ళి ఎబిగైల్ ఆతిథ్యాన్ని పొందాడు. అప్పుడు ఆమె తన భర్తకు, ఈ అతిథిని గురించి ఇలా

అభిప్రాయం వ్యక్తబరిచింది. "ఆయన పూజనీయుడు స్థిరసంకల్పుడు. అటు వంటి వారిపట్ల మనకు గౌరవభావము దానంతటదే కలుగుతుంది. ఆయ నెంతో కలుపుగోరు మనిషి కాని మిత భాషి. లోకదక్షుడూ, మహాజ్ఞానీ - ఆయన తన సంభాషణలో మైత్రీ భావమూ సరసవచనమూ కనుబరు స్తాడు. ఉదారగుణనిధి, ముఖమండలం సహృదయ స్పందనతో తేజరిల్లు తోంది. దేశభక్తి ఒక కాంతి రేఖవలె ఆయన ఫాలభాగాన మెరుస్తోంది. దేశ సేవ ద్వారా మానవ సేవ, ప్రజా సేవ చేసే మహనీయుడీయన"

1776 వసంతకాలంలో ఆమె టామ్ పెయిన్ రచించిన విప్లవకర పత్రం చదవటం తటస్థించింది. అంద విషయమై భర్తకి రాస్తూ అన్నది "కామన్ సెన్సులో టామ్ పెయిన్ చెప్పిన అభిప్రాయాలు మహోన్నత ముగా వున్నాయి. అవి సర్వమాన వాళికీ పనికొచ్చేవి. మీ కాంగ్రెస్ సభ్యులు ఈ కరపత్రము గురించి ఏమంటున్నారో తెలుసుకోవాలని వుంది." (ఇంకా వుంది)

మాతృక : కార్నెల్ లెన్‌గ్వేల్
తెలుగు : యన్నార్ చందూర్

కథానిక

# మృత్యు పరిష్వంగం

## సరోజినీ ప్రేమ్‌చంద్



అంతా నిశ్శబ్దంగా వుంది. అలలు ఒడ్డును తాకినప్పుడు చేసే సంగీత ధ్వనులు తప్ప. విశాలంగా కనుచూపు మేరవరకూ తెల్లని యిసుక పరచుకొని వుంది. వెనుక వైపున మాత్రం కొబ్బరితోటలు కళ్ళకింపయిన పచ్చటి రంగులో ఎత్తుగా గంభీరంగా నిలబడి వున్నాయి. సూర్యకాంతి పడి పరిశుభ్రమైన నీలపురంగులలో తళతళ లాడుతున్నది సముద్రం. అప్పుడప్పుడు తెల్లని పక్షులు హాయిగా గాలిలో ఎగురుతూ ఆనందిస్తున్నాయి.

సముద్రానికి అవతలవైపు దీవి. పచ్చని దట్టమైన అడవితో నిండి వున్నది. ఎత్తుగా వున్న కొండలమీద వున్నది యీ అడవి. కొండలుదాటి అటు దిగితే కానీ జన సంచారం వుండదు. ఇక్కడి నుండి చూస్తుంటే మాత్రం ఆ దీవి, మనుష్యులూ, నాగరికత అంటని నిర్మల ప్రకృతిని ప్రతిబింబిస్తున్నట్లు వున్నది.

డేరా బయట అటూ యిటూ పచార్లు చేస్తూ, కనబడిన దృశ్యంలోని ప్రశాంతతకు ఆశ్చర్యపోతున్నాడు మేజర్ మూర్తి. ఇంత శుభ్రమైన బీచిని మద్రాసు, బొంబాయి, గోవా, వైజాగ్‌లలో ఎక్కడా చూళ్ళేదు. ఎక్కడా ఒక్క కాగితం ముక్క గానీ ప్లాస్టిక్ సంచులు కానీ, తాగి పడేసిన ఖాళీ పళ్ళరసం డబ్బాలు కానీ ఏమీ లేవు. అసలు మనుష్యులు యీ బీచిలో తిరిగిన జాడే లేదు. ఆడమ్ యీవ్ యిటువంటి ప్రదేశంలో నివసించి వుంటారని వూహించవచ్చు.

అనుకుంటుంటేనే ఫక్కున నవ్వొచ్చింది మూర్తికి. ఆడమ్. యీవా? ఇక్కడ? ఈ ప్రకృతి సౌందర్యం, గంభీర నిశ్శబ్దం వెనకాల ఏముందో తను రెండు క్షణాలు పూర్తిగా మరిచిపోయాడు.

అతనికి గుర్తు చేయడానికేమో అన్నట్లు పడవ ఒకటి మెల్ల మెల్లగా తీరంచేరుతూ కనిపించింది. ఆ పడవ క్రమంగా ఒడ్డున చేరింది. ఇద్దరు చుక్కాని వేస్తున్నారు. మరొక యిద్దరు పడవలో సామాను సర్దుతున్నారు.

పడవ ఒడ్డుకి చేరుకునే లోపలే ఎక్కడినుండో పరుగెత్తుకుని వచ్చారు జవాన్లు. టకటకమంటూ బూట్లతో పరుగెత్తుతుంటే, కఠినమైన ఆ చప్పుళ్ళు, గట్టిగా కేకలూ, తుపాకులు గురి చేసి పడవ వాళ్ళని అదిలిస్తున్నారు.

వాళ్ళు గజగజ వణికిపోతూ "ఒణ్ణు మిల్లె సార్" అంటూ చూపిస్తున్నారు – సముద్రంలో పట్టుకు వచ్చిన చేపలని. పడవ బాగా తనిఖీ చేసి, పడవ వాళ్ళని వదిలేశారు సైనికులు. అంతలోనే తెల్లటి పళ్ళు కనిపించేటట్లు నవ్వుతున్నారు చేపలవాళ్ళు. క్షణంలో మృత్యువు నుంచి తప్పించుకొన్నారు. కాస్త పొరబాటు జరిగివుంటే పిట్టల్లాగా కాల్చి పారేసివుందురు వాళ్ళని. అది మరిచిపోయి అంతలోనే నవ్వులు.

సైనికులు మాత్రం నవ్వడంలేదు. వాళ్ళ కాపలా పనిలో ఏమరపాటుకి వీలులేదు. వాళ్ళకి తెలుసు. ఇట్లాగే సాధారణమైన చేపల పడవలాగే కన్పించే యింకో పడవలో మనుష్యులూ యిట్లాగే 'ఒణ్ణు మిల్లె సార్' అని చెప్తారు. తుపాకులు మృత్యు బేలలో తరిపీదు యివ్వడానికి అడవుల్లోకి వెళతాయి. బాంబులు మొదలైన ప్రేలుడు సామాను రోడ్ల మీదా, జనం మధ్యలో పెట్టి, తక్కువ శ్రమతో ఎక్కువ మందిని పరలోకాలకు పంపడానికి వెళతాయి.

లేదూ, చేపల పడవల్లోనే శత్రువులు పడవవారిని భయపెట్టి బలవంతంచేసి ఆయుధాలు, ప్రేలుడు సామాన్లు ఎక్కించవచ్చు. అప్పుడు ఒక్క తుపాకి గుండుతో మొత్తం సామానంతా పేలిపోయి యీ అమాయకులందరూ క్షణాల మీద మృత్యుగహ్వరంలోకి ప్రవేశించవచ్చు. ఇక్కడ మృత్యువుకీ, బ్రతుక్కీ క్షణక్షణం పోటీ జరుగుతూ వున్నది.

ఇంతకూ యీ చేపల వాళ్ళకీ, శత్రువులకీ ఏం భేదం వుంది ? రంగూ, కనుముక్కు తీరూ, రక్తం అంతా ఒక్కటే! వీళ్ళు పొట్టకోసం ప్రాణాలొడ్డి సముద్రం మీద చేపల వేట జరుపుతున్నారు. వాళ్ళు ? వాళ్ళూ బ్రతికి బట్టకట్టడానికే – స్వేచ్ఛగా చేపలు పట్టుకొని, స్వేచ్ఛగా సేద్యం చేసుకొని బ్రతకడానికి కాదూ !

ఇక ఆలోచించ లేక సిగరెట్ పారేసి, డేరాలోపలకు పోయి వైర్ లెస్ సెట్ల ముందు కూర్చుని శ్రద్ధగా విని నోట్సు రాస్తూ మళ్ళీ పనిలో మునిగిపోయాడు మేజర్ మూర్తి.

* * *

రాత్రి భోజనం సమయానికి కెప్టెన్ దేశ్‌పాండీ వచ్చి డ్యూటీ తీసుకున్నాడు. వైర్‌లెస్‌ల ముందు అతన్ని ఇలా కూర్చోబెట్టి అతనికి కొన్ని చేయవలసిన పనులు చెప్పాడు మూర్తి.

"ఈ యీ కనెక్షన్లలో వుపయోగకరమైన సమాచారం వస్తున్నది జాగ్రత్తగా విని వ్రాసి పెట్టు" అని చెప్పి, మెస్సు వున్న డేరాకి బయలుదేరాడు.

మేజర్ సింగు చుట్టకాలుస్తూ కూర్చున్నాడు. మూర్తిని చూడగానే కావలించుకొని "చాలా సంతోషం మేరా భయ్యా ! నీ వింకా వున్నావు !" అన్నాడు.

మూర్తి, సింగు చేతులూ, భుజాలూ వీపూ గట్టిగా తడుతూ, "అచ్ఛా ! నీవు సింగువే అన్నమాట. రక్తమాంసాలూ, ఎముకలూ వున్న మనిషివే - స్పిరిట్‌వి అనుకున్నా !"

ఇద్దరూ గట్టిగా పగలబడి నవ్వుకున్నారు.

వెరొక "చోటా" పుచ్చుకున్నారు.

భోజనం చేస్తుంటే యిద్దరు ముగ్గురు ఆఫీసర్లు కూడా వచ్చి కలిశారు.

సింగ్ పరిచయం చేశాడు.

"మీట్ కెప్టెన్ వేణుగోపాల్ -" చేయి కలిపాడు మూర్తి.

తెల్లగా సుకుమారంగా వున్నాడు వేణుగోపాల్, ఇన్‌ఫెంట్రీ బెటాలియన్. ఆ రోజు పొద్దునే జాఫ్నాలో దిగాడు. అక్కడ్నుంచి యిక్కడికి వేశారు, 'పొలయ్' కి.

"ఇంతకు ముందు ఎక్కడ పోస్టింగ్ చేశావు కాప్టెన్ ?"

"ఒక్క సంవత్సరమే అయింది మద్రాసు ఒటి ఎస్ (ఆఫీసర్స్ ట్రెయినింగ్ స్కూలు)లో నుండి పాస్ అయి. ఈ సంవత్సరం అంతా మోవ్‌లో (MHOW) (Military Head Quarters of War) వున్నాను."

అంతవరకూ బొత్తిగా ఫీల్డు అనుభవం లేనివారు యుద్ధరంగంలోకి రాగానే పొందే Excitement, అమితమైన వుత్సాహం అంతా అతని మాటల్లో ముఖంలో కనబడుతున్నది.

అతని వుత్సాహం చూస్తే మూర్తికి ఎందుకో తన నాలుగేళ్ళ కొడుకు "గౌతమ్" గుర్తుకొచ్చాడు. ఇద్దరివీ పెద్ద పెద్ద కళ్ళూ, అమాయకంగా నవ్వుతున్నట్లుండే నోరు.

గౌతమ్‌ని మద్రాసులో బీచ్‌కి తీసుకెళ్ళాడు. అదే మొదటిసారి వాడు సముద్రాన్ని చూడటం. సముద్రం అంటే ఏమిటో వాడికి తెలియదు. ఏమయినా అంత పరిమాణంలో నీళ్ళు చూడటం వాడి అనుభవంలో ఎరగనిది. వాడి కళ్ళల్లో ముఖంలో కన్పించిన విస్మయం వర్ణించలేనిది. రెండు చేతులూ బార్లా జాపి, యిసుకలో కాళ్ళు కూరుకుపోతున్నా సరే - అట్లాగే సూటిగా ఒళ్ళు తెలియకుండా వేగంగా సముద్రంలోకి పరుగెత్తాడు. మూర్తి పట్టుకొని ఆపకపోతే అలలూ, చెలియలికట్ట దాటుకొని నడి సముద్రంలోకి అట్లాగే పరుగెత్తుతూ పోయేవాడే - నీళ్ళు వాడిని పూర్తిగా ముంచేసేదాకా.

వేణుగోపాల్ వుత్సాహం, అమాయకమైన నవ్వూ చూస్తున్న కొద్దీ అతనంటే ఆకర్షణ ఏర్పడుతున్నది మూర్తికి. ఆకర్షణ క్రమంగా అనుబంధంగా మారింది. రోజూ రాత్రి భోజనాల వేళలో వేణుకోసం ఎదురు చూడటం, అతని సాహసభరితమైన మాటలు వినడం అలవాటుగా మారాయి.

చుటూ వున్న భయంకరమైన వాతావరణంలో అతని మాటలు ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. వేణు చిరునవ్వులు చూస్తుంటే "ఫరవాలేదు. యుద్ధం, శత్రువులు, మరణకాండ, ప్రాణభీతి, ఆదమరిచి నిద్రపోవడం ఎరగని రాత్రుళ్ళూ - వీటి మధ్యలో మామూలు ప్రపంచం యింకొకటి వున్నది" అనే సంగతి గుర్తుకు వస్తూ వుంటుంది.

ఇంకొక వైపున మేజర్ సింగ్ మాటలు ఒక 'మిస్టీరియస్' ప్రపం

# చందూర్ రచనలు

| | |
|---|---|
| నేటి విలువలు | పరిచయం చేసిన పుస్తకాలు |
| దూరాన్ని జయించిన మానవుడు | అన్యాయం |
| ఛార్లెస్ స్టీన్ మెజ్ | ఆఖరి కోరిక |
| కథానికలు | ఎక్కడికి కమలా ? |
| జీవనమార్గం | భానుమూర్తి భార్య |
| ఎలినార్ రూజ్‌వెల్ట్ | రాధ నవ్వింది |
| తొలి పాఠాలు | కొత్త లోకాలు |
| ప్రేమగాథ | కొన్ని గ్రంథాలు |
| హెలెన్ కెల్లర్ | సీతతో సినీమాకు |
| డా॥ మేరి వెర్గిస్ | ప్రజానాయకుడు ప్రకాశం |
| నేల - నీరు | నట్టింట దీపం |
| మహానగరంలో | మాంగుళూర్ మెయిల్ |
| జీవితం | మహాబలిపురం |
| నవచైనా | మనకీ ఒక కారు |
| ప్రతి గురువారం | సీతా ఫలాలు |
| ఆరు కథలు | భాష |
| చెట్లు | పూసల మేడ |
| మరొక ఆరు కథలు | శివరావు |
| ఈ నాగరికత | కలడో లేడో |
| నాలుగు రోడ్లు | మావో పాలనలో |
| అణుశక్తి | చైనాలో మైనారటీలు |
| బాలరాజ్యం | అమెరికా |
| గ్రామవైద్యుడు | జులై నాలుగు |
| సాహస యాత్ర | వరదల్లో వాంగ్ |
| అంతేనా | మాతా భూమాతా |
| కాఫీ మానెయ్యడం | బీమలబారు |

వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి.

చాన్ని. పొగమంచు తెరల చాటునించి కనిపించీ కనిపించకుండా చూస్తూం టాయి.

"సియాచెన్ సెక్టర్‌లో రాత్రి డ్యూటీ చేస్తేగానీ అసలు జీవితం అంటే, ఏమిటో అర్థం కాదు. వేణూ మేరే ననాభాయీ - (నా చిన్న తమ్ముడా) అని సింగు అంటే,

"నా నెక్స్టు పోస్టింగుని సరి హద్దుల్లో వేయమని కోరాలనే అను కుంటున్నాను. ప్రత్యక్షంగా అన్ని అనుభవాలు పొందాలనే నేను ఆర్మీలో చేరింది." పిడికిళ్ళు బిగించి, గంవేగా వూపిరి పీలుస్తూ అంటాడు వేణు. వేణు కళ్ళల్లో నల్లటి కనుపాపలు తళతళ మెరిసాయి. పట్టుదలతో మాట్లాడు తున్నట్లు దృఢమైన పలువరసలు గట్టిగా బిగించాడు.

సింగు వినిపించుకోకుండా, గ్లాసు మీదికి కళ్ళూ, ముఖమూ వంచి చెప్పుకు పోతున్నాడు.

"అక్కడ రాత్రుళ్ళు నల్లగా భయం కరంగా వుండవు. తెల్లగా భయం కరంగా వుంటాయి. చుట్టూ ఎప్పుడూ పడుతూవుండే మంచువల్ల. తెల్లని, చల్లని, నిశ్శబ్దమైన రాత్రి, ఊహించుకో! ఒళ్ళు జలదరించే ఒంటరి తనం. వుండీ వుండీ వీచేబలమైన మంచుగాలి. అటువంటి రాత్రివేళ పరిచయమైంది నా స్నేహితురాలు." కలలోలాగా ఆగి ఆగి మాట్లాడుతున్నా, స్పష్టంగానే చెప్తున్నాడు సింగు.

"పాపం! శూన్యంలో తిరిగి తిరిగి అలసటనుండి సేద తీర్చుకోడానికి శరీరమయినా లేక, ఆత్మలో మండు తున్న స్నేహానుభూతులు పంచుకో డానికి నన్ను ఎన్నుకుంది.... నాతో ఎన్ని సంభాషణలు - ఎంతటి వెచ్చటి వోదార్పు యిచ్చేది ఆ మంచు ఎడారిలో కాదంబిని.... కాదంబిని...." ఆ పేరు వుచ్ఛరించడంలోనే మహత్తరమైన ఆనందమూ, తీయదనమూ వున్నట్లు మళ్ళీ మళ్ళీ నాలుక మీద ఆ అక్షరాలు తిరగేస్తూ పెదవులు తడుపుకున్నాడు సింగు.

ఏమిటో అంతా అర్థం లేనట్లుగా, అయోమయంగా అనిపించింది వేణుకి. మూర్తీ, వేణూ యిద్దరూ ఏమీ మాట్లాడ లేక పోయారు, కుర్చీల్లోంచి లేవాలను కున్నా లేవలేక పోయారు. మూర్తి చేతిలో వున్న గ్లాసుని నోటిదాకా తీసుకురావడానికి కూడా శక్తి లేనట్లు వుండిపోయాడు. చేయి బిగుసుకు పోయింది. ఎవరో తనను కదలకుండా మెదలకుండా చల్లని చేతులతో స్పృశించి నొక్కి వుంచినట్లు అనిపించ సాగింది.

అందుకే రెప్పలు కూడా ఆర్పడం మాని విగ్రహంలా కూర్చుండి పోయాడు.

* * *

జీపుకి ముందుగా ఆల్ క్లియర్ సిగ్నల్ యిచ్చాకే బయలుదేరారు. అయినా దారిలో డ్రయివర్ జీపు ఆపే శాడు. వైర్‌లెస్ మీద సమాచారం వచ్చింది. అంతకు గంటముందే ఒక నిపుణుల బృందం వచ్చి పరీక్షించి వెళ్ళారు. రోడ్డు మీద ప్రమాదకరమైన

# క్షయ రోగంతో పోరాడండి

1 రెండు వారాంకు మించి ఎడతెరిపి లేకుండా మీకు దగ్గు ఉన్నప్పుడు లేక ఉమ్మిలో రక్తాన్ని గమనించినప్పుడు ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయ రోగంతో మీరు బాదపడుతూ ఉండవచ్చు

2 మీ సమీప మండలి ప్రాదమిక ఆరోగ్య కేంద్రం డి స్పెన్సరీ లేక టి బి సెంటరులో ముఖ్యంగా మీ ఉమ్మితో సహా మీమ్మల్ని పరీక్ష చేయించుకోండి




3 నిర్ధారిత సమయం వరకు. క్రమంగా. డాక్టరు ఇచ్చిన సలహా ప్రకారం మందులను తీసుకున్నట్లయితే. క్షయ రోగాన్ని నయం చేయవచ్చు.

4. చికిత్స కంటె ముందు జాగ్రత్తలు తీసుకోవటం ఎప్పుడూ మంచిదే అందుచేత మీ బిడ్డకు బి సి జి టీకాలు వేయించండి



సెంట్రల్ హెల్త్ బ్యూరో (డి.జి.హెచ్.ఎస్)
మినిస్ట్రీ ఆఫ్ హెల్త్ అండ్ ఫ్యామిలీ వెల్ఫేర్
కోట్లా రోడ్డు, న్యూ ఢిల్లీ 110002

davp 88/729 TEL

ప్రేలుడు సామానులు వున్నాయేమో పరిశీలించి చూసి, సందేహాస్పదమైన వాటిని దూరంగా తీసుకెళ్ళి డిఫ్యూజ్ చేయడానికి! కాని మళ్ళీ యీ జీపు వచ్చే లోపల అనుమానం కలిగించే రాక పోకలు జరిగాయి. రోడ్డు పక్కనున్న పొదలలో నుండి ఎవరో వెళ్ళిపోవడం జవానులు చూశారు.

జీపు దిగారు కెప్టెన్ వేణు, మేజర్ మూర్తి. వాళ్ళతో పాటు జీపులో ప్రయాణం చేస్తున్న యిద్దరు జవాన్లు కూడా దిగి ముందుకు వెళ్ళబోయారు.

"రోఖా జావ్ పాండే, నర్సయ్యా!" అజ్ఞ జారీ చేశాడు మూర్తి.

ఆగిపోయారు జవాన్లు.

"అరె! ఇట్లా అవుతే మనం ప్రతి అడుగుకీ అరగంట ఆగుకుంటూ వెళ్ళాల్సి వస్తుంది. పన్నెండుకల్లా మనం 'వాయునియ' చేరాలి, అడుగు ముందుకు వేయబోయాడు వేణు - కుడి ఎడమలకు పరీక్షగా చూస్తూ.

"అంటీ ఎక్స్ప్లోజివ్స్ స్క్వాడ్ వచ్చేదాకా మనం యిక్కడ నుండి ముందుకు కదలకూడదు. అది ప్రస్తుత పరిస్థితుల్లో వున్న స్టాండింగ్ ఆర్డర్స్"

"అవి రూల్సు, మేజర్! యుద్ధంలో కావలసింది రూల్సు కాదు. సాహసం. మన జీపు ఆగుతే, మన వెనకాల కాన్వాయ్ ఆగుతుంది. అక్కడ వందల కొద్దీ ప్రాణాలు కాన్వాయ్‌లో రాబోయే మందులూ, ఆహారం కోసం కనిపెట్టు కొనీ వుంటాయి. వాళ్ళకోసం మనం రూల్సు అతిక్రమించక తప్పదు. నేను చూస్తాను ఏం వున్నాయో రోడ్డుమీద; చూసి క్లియర్ చేస్తాను"

చక చకా అడుగులు వేస్తూ దారికి రెండు వైపులా పరిశీలనగా చూస్తు న్నాడు వేణు.

నిజమే. 'వాయునియ' లో జరిగిన బాంబుల దాడిలో వేలమంది పౌరులు గాయపడ్డారు. సమయానికి కాన్వాయ్ చేరకపోతే ఎంత ప్రాణ నష్టం జరుగు తుందో? కానీ మన ప్రాణాలు! పోనీ మన ప్రాణాలు పోవడం వలన వాళ్ళ ప్రాణాలు కాపాడి నట్లవుతుందా? రోడ్డు మీద ఏ బాంబులూ లేవేమో! అనవసరంగా భయపడుతున్నామేమో! మేజర్ మూర్తి సందిగ్ధంలో పడి పిడికిళ్ళు బిగించి చూస్తున్నాడు.

వేణు పది బారలు నడిచాడో లేదో విరిగిపోయిన ప్లాస్టిక్ బకెట్ కనబడింది.

"వైర్లు డిఫ్యూజ్ చేయడమేగదా వాళ్ళువచ్చి చేసేదయినా" - వంగి ఆ పని చేయబోయాడు.

అయితే యిది వేణుకంటె దుస్సా హసులు, ప్రాణం అంటే బొత్తిగా లెక్కలేనివారూ; ప్రాణాలు పోగొట్టు కోవడం, ప్రాణాలు తీయడం తప్ప వేరే లక్ష్యం లేనివారు అమర్చిన బాంబు. వాళ్ళు అమరుస్తూ వుంటేనే పేలిపోయి వుండచ్చు. కాని పేల లేదు. వేణు వేలి తాకిడికితో బ్రహ్మాం డం బద్దలయినంత శబ్దం వినిపించింది.

మూర్తీ, పాండే, నరసయ్యా జీపు డ్రయివరూ చటుక్కున నేల కంటుకు పోయినట్లుగా బోర్లబొక్కలా పడు కున్నారు.




అతి రుచికరమైనది

# క్రేన్

వక్కపొడి

దీనికిసాటి మరొకటిలేదు













మూర్తి యంత్రంలాగా లెక్క పెడుతున్నాడు. 60 - 70 - 78, 79 - 100; తరువాత మరో నూరు. జాగ్రత్త కోసం మళ్ళీ యింకో నూరు .... అంతా నిశ్శబ్దంగా వుంది.

మూర్తి లేచి నిలబడి ఆర్డర్ యివ్వగానే పాండే, నరసయ్య, డ్రయివరు కూడా లేచి నిలబడ్డారు.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది.

చుట్టు పక్కల పొదలు కొన్ని మాడిపోయాయి.

రోడ్డు కటువైపు నుండి క్లియర్ చేసుకుంటూ వస్తున్నారేమో — దూరంగా జీపు హారన్ వినిపించింది - ఇక్కడి జీపులో వైర్లెస్లో ఏవో శబ్దాలు వస్తున్నాయి.

మేజర్ మూర్తి జీపు వద్దకి నడిచి వైర్లెస్ అందుకుని యాంత్రికంగా మెసేజ్ తీసుకున్నాడు.

"కెప్టెన్ వేణుగోపాల్ .... ...." అంటూ సమాచారం యిస్తున్నాడు. తను చెప్పేది, తనకే నమ్మబుద్ధి కావడం లేదు.

కళ్ళు చిట్లించి, దృష్టి సారించి రోడ్డు వైపుకు చూశాడు. కెప్టెన్ వేణు పదినిముషాల క్రిందట వంగి నిలబడిన దృశ్యం యింకా కళ్ళ ముందు స్పష్టంగా వుంది. ఇప్పుడు అక్కడ ఒక్క పిసరంతయినా ఒక మానవుడి ఆనవాలు లేదు. అనుకోకుండా కళ్ళు ఎత్తి చూశాడు. చెట్ల కొమ్మల మీద చిన్న కేమొఫ్లేజి యూనిఫాం ముక్క వేలాడుతూ కనిపించింది. కళ్ళు తిరిగి కడుపులో అంతా ఖాళీగా అనిపించింది.

డ్యూటీ, పనిలోకి తరిమింది.

* * *

రాత్రి డేరాలో నిద్ర పట్టలేదు. బయటకు వచ్చి సిగరెట్లు కాల్చుకుంటూ అశాంతిగా తిరిగాడు, మేజర్ మూర్తి.

"వేణు అకస్మాత్తుగా అదృశ్యమయ్యాడు. అంతేనా? వేణు సమాప్తమయ్యాడా? వేణులో ఏమీ మిగల లేదా? శరీరంలోని పదార్థమంతా కార్బన్గా, వాయువులుగా మాడిపోయి ప్రకృతిలో కలిసింది. అతని ఆలోచనలు, మనసు - అవి. కూడా మాడి మసి అయిపోయాయా? కాదు - కాదు - వేణు - అసలు వేణు ఎక్కడో వుండేవుంటాడు. - వేణూ వేణూ" - తనలో తనే పిచ్చిగా గొణుక్కుంటున్నాడు మూర్తి.

తల తిరిగిపోతున్నది మూర్తికి. ఏదో అర్థం కాని కదలిక. తనని స్పృశించినట్లు అనిపించింది. చేతిలో సిగరెట్ కిందపడేసి "వేణు - వేణు" అంటూ తదేకంగా ఆ భావం మీదే మనసుని కేంద్రీకరించాడు. నిశ్శబ్దంగా, నిశ్చేతనంగా ఒక రాయి మీద కూర్చుండిపోయాడు. మొద్దు బారిపోతున్నది మెదడు. "ఊహు - తెలుసుకోవాలి - వేణు ఏమయాడో తెలుసుకోవాలి" అనుకుంటూ మొద్దు బారుతున్న మెదడుని బలవంతాన స్పృహలోకి తీసుకు వస్తున్నాడు.

అలల సంగీతం తప్పితే నిశ్శబ్దంగా వున్న పరిసరాల్లో పడవ కదలిక చప్పుళ్ళు సుతి మెత్తగా వినిపించాయి. తల ఎత్తి చూశాడు. అలల మీద తేలుతున్నది పడవ, తనని ఆవరించి వున్న స్పర్శ ఏదో తనని వదిలి ఆ పడవలోకి వెళ్ళిపోతున్నట్లు అని పించింది, మూర్తికి.

అదిగో - అదిగో - నీడలాగా ఒకరు ఆ పడవలో - వేణు - వేణే ఆ పడవ ఎక్కి వెళ్ళి పోతున్నాడు. సాహసంతో నడి సముద్రంలోకి ఒంట రిగా పోతున్నాడు. మృత్యువంటే భయం లేకుండా!

"వేణూ - వేణూ" - అని పిలవ బోయాడు మూర్తి. గొంతు పెగలక కీచుగా ధ్వని వచ్చింది. ముందుకు పరుగెత్తాడు.

ఆయాసంగా వుంది. అయినా పరు గెత్తాడు. అయ్యో, పడవ వెళ్ళి పోతున్నది. పట్టుకోవాలి - వేణు వున్నాడా లేడా తెలుసుకోవాలి - మృత్యువంటే ఏమిటో తెలుసు కోవాలి.... పరుగెత్తాడు. కాళ్ళు యిసు కలో కూరుకుపోతున్నా సరే. బలవం తాన పరుగెత్తాడు. రెండు చేతులూ చాపుకొని పరుగెత్తాడు.

పడవ దాదాపు అందుతున్నది. శక్తి అంతా వుపయోగించి పడవలోకి ఎగిరి దూకాడు.

మళ్ళీ బ్రహ్మాండం బద్దలవు తున్నట్లుగా చప్పుడు. ఆ తరువాత ఒకొటొకటిగా పడవలో మందుగుండు సామాను అంతా పేలుతున్న చప్పుళ్ళు.

మేజర్ మూర్తి శరీరం మాయ మయింది. దట్టమయిన అడవిలోని ప్రశాంతత భగ్నమయింది. ఇప్పుడు బీచిలో యిసుక తెల్లగా, శుభ్రంగా లేదు. పేలిపోయి మిగిలిన చెత్తా చెదారం వెదజల్లబడివుంది. పక్షులు అక్కడక్కడా చచ్చిపోయి పడి వున్నాయి. సముద్ర తరంగాలు విషా దంగా సంగీతం పాడుతున్నాయి.



---

హాయిగా నిశ్చింతగా విచ్చుకోలేని చిరునవ్వులే నుదుటిమీద ముడత లవుతున్నాయి. —మార్క్ ట్వేన్

మీరొక పనికి పూనుకున్నప్పుడు, కార్య ఫలితమే ప్రధానం గాని మీ మనోవేదన లోకానికి అక్కర్లేదు.

—మాగానాల్డ్

గడ గడ తాగేవాళ్ళకి రుచి తెలియ నట్లే, చకచకా మాట్లాడేవారు తాము ఏమి మాట్లాడుతున్నదీ ఆలోచించరు.

—ప్రియార్

స్వార్థ పర్వతం, మొండితనం, జాలిగుండె లేకపోవటం - ఈ మూడూ మీ హృదయాన్ని చిమ్మ చీకట్లో ముంచి, విశ్వవిభుని కృపా వీక్షణానికి దూరం చేస్తాయి. —గ్రేస్

తత్త్వకోవిదులూ వేదాంతులూ చెప్పినట్లుగా ఈ బ్రతుకు బాటని స్మృతి హారంలోని రుద్రాక్షలుగానే భావిద్దాం. ఎటొచ్చీ వారు విస్మరిస్తున్న దేమిటంటే, ఈ బాట మన అడుగు పడగానే అంతమేర ముడుచుపోయి ముందుకి తోస్తుంది. —కిర్కిగార్డ్

# ఇస్లామిక్ సాహిత్యం

1. దివ్య ఖుర్‌ఆన్ (మొదటి సంపుటం) 50-00
2. హదీసు వెలుగు - సాధారణ ప్రతి 30-00
   గ్రంథాలయ ప్రతి 35-00
3. మహాప్రవక్త ముహమ్మద్ 20-00
4. ఇదియే ఇస్లాం 15-00
5. సందేహాలు - సమాధానాలు 25-00
6. నేను ఆరాధించే ఇస్లాం 10-00
7. ఇస్లాం శిక్షణ 7-00
8. శ్రేయస్కర మార్గం 2-40
9. ఇస్లాం మరియు అజ్ఞానం 2-25
10. మరణానంతర జీవితం 1-00
11. హేతువు కాంతిలో దైవప్రవక్త 2-00
12. కారుణ్య వ్యవస్థ 1-80
13. పరదా ప్రగతికి ప్రతి బంధకమా ? 1-50
14. అంటరానితనం 1-00
15. ఇస్లాం రాజకీయ సిద్ధాంతం 3-40

**ఇంకా వీటితోపాటు తెలుగులో ఇస్లామీ సాహిత్యం కొరకు సంప్రదించండి.**







# జెమిని

మీ దంత సౌభాగ్యానికి పూర్తి రక్షణ

స్పియర్‌మెంట్, పిప్పరమెంట్, లవంగనూనెల సమ్మేళనం

## జెమిని కెమికల్ ప్రొడక్ట్స్

P.B.No.7 మచిలీపట్నం-521001.

# కొత్త పుస్తకాలు

కథానిక - 1989 (1).... కృష్ణమూర్తి - 1989 (1) .... ప్రాప్తి బుక్స్, పోస్ట్ బాక్స్ 5018, బిసెంట్ నగర్, మద్రాసు - 600 090 ....ఒకొక్క అయిటమ్‌కి పదిరూపాయిల పోస్టల్ ఆర్డరు పంపితే, కథానిక నాలుగు సంచికలూ, కృష్ణమూర్తి నాలుగు సంచికలూ (1989 లో వెలువడేవి) మీకు అందుతాయి.

శ్రీవిరించి చేస్తున్న ఈ సాహితీ ప్రయత్నం ప్రశంస నీయమైనది. తూకానికి పత్రికలే తప్ప, సాహిత్య విలువలు మృగ్యమవుతున్న రోజులలో ప్రాప్తి బుక్స్‌వారి ఈ సత్ప్రయత్నం, కొంతలో కొంత విజయం సాధించా లని మనస్ఫూర్తిగా అభిలషిస్తున్నాము.

'నేనో కథ రాశాను - అది అచ్చు యేందుకు ఎవరికి పంపాలి ?' - అని ప్రతి నాలుగో వ్యక్తి అడిగే ఈ రోజులలో, కథానిక అనగా ఏమిటి, సాహితీ ప్రక్రియగా దాని స్థానమేమిటి, సమున్నత గౌరవ మెటువంటిది ? - ఇలాటి విషయాలు మూడునెలలకో సారి చర్చిస్తూ, ప్రసిద్ధ కథకుల రచనలు ఎందువల్ల విశిష్టత నొందినదీ వివరి స్తుంది 'కథానిక' (1/8 డెమ్మీలో పదహారు పేజీలు మాత్రమే అయినప్ప టికీ ఎంతో చక్కగా తెల్లటి దళసరి కాగితం మీద అందంగా ప్రింట్ చేశారు).

కొడవటిగంటి కుటుంబరావు 'నిలవనీరు', తండ్రి యింటి దగ్గర జీవితం 'మురికిగుంట' ఈ కొత్తజీవితం 'పెద్దచెరువు' అయితే రెండు చోట్లా 'నిలవనీరే' - అని శ్రీరాములు ఎలా తెలుసుకున్నదీ చెబుతుంది ఈ కథానిక.

"నాటకాలలో వేషం వేసే అమ్మాయి గురించి చెడ్డగా వ్రాస్తాడు ఒక పత్రికా విలేఖరి. ఆ అమ్మాయి అతనితో పోట్లాడదామని బయలుదేరి వెళ్లి, పోట్లాడి, చెడామడా తిట్టి, చివరికి అతన్ని పెళ్లి చేసుకుందనుకోండి - అది కథ అవుతుంది," అంటారు రచయిత 'కథలవీధులు' ప్రస్తావిస్తూ.

నేటి వారపత్రికల పేజీలు నింపు తున్న మహాకథకులలో, 90 శాతం, హెన్రిక్ బాల్ (1972 లో నోబెల్ బహుమాన గ్రహీత) పేరు పొరబాటున కూడా వినివుండరు. 'వీడుకోలు' అని ఆయన రాసిన కథానికలో, ఉద్యోగ ధర్మంగా స్వీడన్ వెళ్తున్న ప్రియకాంత - పదిహేనుళ్ళుగా తెలిసిన ఆత్మసఖి - గాయమింకా మానని నొప్పికాలుతో ప్లాట్‌ఫారమ్ మీద నిలబడి దీనంగా

తనలోకి చూస్తున్న ఫ్రెండుతో అంటుంది: 'ఇద్దరూ కలిసి ఒకే చోట వుండటం కాదు ముఖ్యం.' .... అతి సామాన్యమైన ఆ మాటలతో హృదయ గీతిక పలికిస్తాడు కథకుడు. ఆ వాక్యంలో అంతటి స్పందన తెచ్చేందుకే మిగతా వాతావరణమూ, శిల్పమూ, పాత్రలూను.

'జిడ్డు కృష్ణమూర్తి ఏం చెప్పారు? ఆయన ఫిలాసఫీ ఏమిటి?' - అని చాలామంది అడుగుతూంటారు.... 46 సంవత్సరాల తర్వాత 1980లో దివ్యజ్ఞాన సమాజ ప్రాంగణంలో అడుగుపెట్టి, 1986 జనవరి 4 వ తేదీన మదరాసులో తన చివరి ఉపన్యాసం యిచ్చి, అదే సంవత్సరం ఫిబ్రవరి 17 వ తేదీన కన్ను మూసిన జిడ్డు కృష్ణమూర్తి, తన ఫిలాసఫీ ప్రకారం జీవించిన ఫిలాసఫర్. మహామేధావి, నిత్యసత్యాన్వేషి, మతాల తెరలు తొలగించిన మహాజ్ఞాని, నిర్మలాంతరంగుడు, నిరుపమాన కరుణామూర్తి .... అనుభవం, పాండిత్యం, జ్ఞాపకం, ఆలోచన, ఆచరణ - దానంతటినీ కలిపి అనుభవజ్ఞానం అంటున్నాం. 'నేర్చుకోవడం' వీటికి భిన్నమైనది. ఇప్పటికైనా నేర్చుకుందాం - అనుకుంటూనే నేర్చుకోలేక, లెంపలు వాయించుకుంటాం. ఇటువంటి వైరుధ్యాల కలయికే జీవితం.... యాంత్రికమైన శిక్షణనుంచి అలవాట్లు వస్తాయి, అలవాట్లు ఆచారాలవుతాయి. అయితే; వీటికి లోనుగాని 'క్రమత' అంటూ ఒకటి ఉంది.... 'నేను, నాది' అనే భావంతోబాటు, ఆ ఆలోచనతోబాటు, 'నాది' అనుకున్నది ఏమవుతుందో అనే 'భయం' కూడా వెంటనంటి వుంటుంది. థాట్‌కీ టైముకీ (ఆలోచన - సమయం) గల పరస్పరాశ్రయమూ ఆశలకు ఆకాంక్షలకుగల స్వరూప స్వభావాలూ తెలుసుకోవడం ద్వారా గమనమూ, నిరంతర చింతన ఏర్పడుతున్నాయి.

కృష్ణమూర్తి ఫిలాసఫీ ముని వాటికలకు చెందినదికాదు - దైనందిన జీవితంలో చైతన్య కారకం.

—క్షీరసాగరమ్

## మనవి

స్థలా భావం వల్ల చిత్రజగతి సమీక్షలు, మజిలీ సీరియల్ ఈ సంచికలో చేర్చలేకపోయాము.

## ఈ మధ్య అందినవి :

హెలెన్ కెల్లర్ - జీవితగాథ. డా॥ ఎన్. మంగాదేవి.... విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు - 500 001.... రు. 7-00.

'నీలాపనిందల నీలగిరి నిర్ఘోషి' - రచన: ఎవి ఆర్‌జి కృష్ణమూర్తి, ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ అకాడమీ ఆఫ్ సైన్సెస్, ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆవరణ, హైదరాబాదు - 500 007.... వెల: రు. 60-00.

రాముడికి సీత ఏమవుతుంది? - ఆరుద్ర.... రు. 10 - 00; తులసి కథలు - వాగంటి తులసి.... రు. 12-00; విజ్ఞానశాస్త్ర వినోదాలు - మార్టిన్ గార్డ్నర్ రచనకి తెలుగు. జ్ఞానేశ్వరరావు....రు. 6-00; చిన్నారి పాటలు - సమతారావు.... రు. 6-00; ఊహారోగి - మోలియర్ రచనకు తెలుగు : వినయమణి.... రు. 10-00; పిసినారి - మోలియర్ రచనకు తెలుగు : వినయమణి.... రు. 8-00; మీ పిల్లల మనస్సు - చంద్రశేఖర్ కన్నడ మూలానికి తెలుగు : భార్గవీ రావు.... రు. 3-00.... పైపుస్తకా లన్నీ ప్రచురించినవారు : విశా లాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001.... బ్రాంచీలు: విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

అందుకున్నవన్నీ గాకపోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.

---

పది కుంచాల మాటలు కొలిచి పోస్తే, అందులో తొమ్మిది స్త్రీలు తీసు కున్నారట. —బాబిలోనియా సామెత

విధేయతతో నడుచుకోవటం చేత నైనవారికి శాసనాధికారం దానంతటదే వస్తుంది. —వివేకానంద

వనిత చెప్పే 'అవును', 'కాదు'లకు సూది మోపినంత స్థలం వుండదు. —సెర్వాంటిస్

# ముఖ చిత్రం



కృష్ణాజిల్లా నందివాడ మండలం పెనుగంచిప్రోలులో 1876 మే నెల 18 వ తేదీన జన్మించిన కొమర్రాజు వెంకట లక్ష్మణరావు తన మూడో ఏట పితృ విహీనుడయాడు. ప్రాథమిక విద్య అన్నగారి వద్ద భువనగిరిలో. ఆ తర్వాత చదువు అంతా నాగపూరులో భండారు మాధవరావు (బావగారు) సంరక్షణలో. నాగపూర్ అవడం వల్ల మరాటీ తప్పని సరిగా నేర్చుకోవలసి వచ్చింది. మరాటీతో బాటు సంస్కృతం కూడా అభ్యసించారు. మాతృభాష తెలుగు వుండనేవుంది. హిందీ కూడా నేర్చుకున్నారు. 1893 లో నాగపూర్ మారిస్ కాలేజీలో చేరి, అక్కడ బి.ఎ. పాసై, ప్రయివేట్‌గా చదివి కలకత్తా యూనివర్సిటీ ఎమ్ ఎ 1901లో ఉత్తీర్ణులయారు. నాగపూర్‌లో చదువుకుంటున్న రోజులలోనే, రామాయణంలోని 'పంచవటి' మహారాష్ట్రలోనిదా, ఆంధ్రాలోనిదా అనే వివాదంలో పాల్గొని, ఆంధ్రాలోనిదే నని నిరూపించారు.... తండ్రీ తాత గారలు మునగాల జమీందార్ల వద్ద దివానులుగా పనిచేసిన కారణాన, లక్ష్మణరావుకి ఆ దివాన్‌గిరీ సంక్రమించింది. మునగాల దివానుగా కోర్టు పనులమీద ఆయన తరుచూ మద్రాసు రావలసి వస్తూండేది. మద్రాసులోనే వుండి తెలుగు భాషాసేవ చేయడానికి ప్రోత్సహమిచ్చారు మునగాల రాజా. ఆధునిక విజ్ఞానాన్ని తెలుగు ప్రజలకు అందించాలనే తపనతో కొమర్రాజు వెంకట లక్ష్మణరావు 1906 లో మద్రాసు నుంచి 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' స్థాపించారు. అయ్యదేవర కాళేశ్వరరావు అప్పట్లో ఆ గ్రంథ మండలి కార్యదర్శి. 1907లో ఆచంట లక్ష్మీపతి బయాలజీని తెలుగులో 'జీవశాస్త్రం' అనే పేరుతో 'విజ్ఞాన చంద్రిక' ద్వారా ప్రచురించారు. పదార్థ విజ్ఞానం, రసాయన శాస్త్రం, వృక్షశాస్త్రం (ఫిజిక్స్, కెమిస్ట్రీ, బొటనీ) వంటివే గాక, దేశచరిత్రలు, మహాపురుషుల జీవితగాథలు యిలాటి వెన్నో వెలువరించి, సంస్కృతీ పరమైన నూతన శకానికి మార్గదర్శక పాత్ర వహించింది విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి.... ఇంగ్లీషులోని 'ఎన్‌సైక్లోపేడియా' మాదిరి 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం' ప్రచురించాలనే ఆయన ప్రయత్నం తలకు మించిన బరువై మూడు సంపుటాలు మాత్రమే బయటికొచ్చాయి. మరొక ఏభై ఏళ్ల తర్వాత తెలుగు భాషా సమితి నిర్వహింపనున్న బృహత్ ప్రణాళిక అది.... విజ్ఞానఖని లక్ష్మణరావు 1923 లో దివంగతులయారు.

# డైరీ

## ఫిబ్రవరి 04, 1989

'గీటురాయి' మలిక్ మూడు నెలల క్రితమే వ్రాశారు - మేమిద్దరం వారి పత్రిక దశమ వార్షికోత్సవంలో పాల్గొనాలని, తెలుగు భాషని చెవికింపైన మాటలలో చెప్పే మలిక్ మాకు ఏడెనిమిదేళ్లుగా తెలుసు - ఆయన రచనా విధానంపట్ల మాకెంతో అభిమానం. మొదటి లేఖలోనే కార్యక్రమంలో పాల్గొంటున్న మిగతా వారి పేర్లు (దొణప్ప, నారాయణ రెడ్డి, పొత్తూరి, పురాణం, బోయి భీమన్న మున్నగువారు) చెప్పేసరికి, మేము కాదనగల అవకాశం లేకపోయింది. అయితే ఒక విషయం మాత్రం తెలిపాము - "మేము హైదరాబాదు రావడమంటే రెండు వేలవుతుంది - మీ సంస్థ ఆ వ్యయం భరించ గలిగితే మాకు అభ్యంతరం లేదు - పదిహేను వందలు రైలు టికెట్లు ; నాలుగైదు వందలు అక్కడ హొటల్ బిల్లు" .... వారం తిరక్కుండా, పదిహేను వందల డ్రాఫ్టు పంపారు 'గీటురాయి'.... ఈ ఫంక్షన్ జనవరి మొదటివారంలో జరగవలసివుంది. కాని, డిసెంబరు ఆఖరివారంలో ఆంధ్రాలో జరిగిన అల్లర్ల కారణంగా వాయిదా పడింది ....ఫిబ్రవరి అయిదో తేదీ ఉదయం పది గంటలకు ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో 'గీటురాయి' వారపత్రిక దశమ వార్షికోత్సవం. ఆ సందర్భంగా నిన్న సాయింత్రం చార్మినార్‌లో బయలుదేరాం .... తెల్లారి లేచి, కాఫీలయాక ఎదురు బెర్తులోని సమద్ నూరస్ (నాగార్జునా స్టీల్స్) తేట తెలుగులో కబుర్లు మొదలెట్టారు.... "సంక్రాంతి పండగకి కాకినాడ దగ్గిరున్నవాళ్ల ఊరు వెళ్లాను - మా పండగలకి ఆమె మా ఊరు అనంతపూర్ వస్తుంది. ఆమె లెక్చరరుగా పని చేస్తోంది - నేను నాజాబ్ మీద టూర్లకి వెళ్లకతప్పదు. పిల్లలిద్దరూ కాన్వెంటులో చదువుతున్నారు - హౌస్‌కీ పరువుంది, యింటినీ పిల్లలనీ చూసుకునేందుకు ! పండగలప్పుడు బంధువులతో గడపడం తప్ప, నిత్యకృత్యంలో మతప్రమేయ మేమీ లేదు మాకు ! ప్రేమించి పెళ్లిచేసుకున్నాం - అభిరుచుల్లో అలవాట్లలో చాలా సామ్యం ఉంది. వుయ్ ఆర్ ఫస్ట్ ఇండియన్స్" - అని ఆ యువకుడు తమ దాంపత్యం గురించి చెబుతూంటే, (మేము ఫలానా అని తెలుసాయనకు), పాతికేళ్ల క్రితం

ధనిష్ట వ్రాసిన నవల జ్ఞాపకం వచ్చింది. అప్పట్లో నవలల పోటీలో, దానికి మొదటి బహుమతి యివ్వాలని నేను పట్టుబట్టినా, సంపాదకుల అభిప్రాయం మరొక విధంగా ఉండటంవల్ల నా మాట నెగ్గలేదు (మతాంతర వివాహాన్ని ప్రోత్సహిస్తోందని ఎడిటర్ గారి అభ్యంతరం) ఇదే విషయం సమద్ నూరస్‌తో చెప్పాము. సంప్రదాయం పేరిట కొందరు వెనక్కి చూస్తూంటే, విద్యావినయ సౌశీల్యాలతో మరి కొందరు ముందడుగు వేస్తున్నారు. ఏభై ఏళ్ల క్రితం శ్రీ శ్రీ చెప్పినట్టు 'పదండి ముందుకు, పదండి ముందుకు పదండి పోదాం పైపైకి' అన్నవారిదే ఈ ప్రపంచం .... నాంపల్లికి శంకర్ వచ్చాడు; నల్లకుంటలో యివ్వవలసి నవి యిచ్చేసి, నారాయణగూడా టాజ్ 23 వ నెంబరులో పెట్టెలు యింకా తెరిచామో లేదో, టెలిఫోన్ .... 'అప్పుడే ఎవరికి తెలిసిందబ్బా' అను కుంటూ రిసీవర్ ఎత్తాను. 'హల్లో చందూర్‌గారా, నేను - రమణిని, టివి సెంటరు నుంచి. మీరీపాటికి వచ్చి వుంటారనీ నాకు తెలుసు .... రేపు మధ్యాహ్నం రెండు గంటలకి మీరు మా సెంటర్‌కి వస్తున్నారు .... మాలతి గారిని ఇంటర్‌వ్యూ చేయాలి,'' - అన్నా రామె. 'వెనకొకసారి చేశారుకదా ?' అన్నాను. "అప్పట్లో బ్లాక్ అండ్ వైట్ - ఇప్పుడు కలర్‌లో" అన్నారామె నవ్వుతూ ! .... ఇంటర్‌వ్యూయర్ బొమ్మా హేమాదేవి కుమార్తె".... అర గంట పోయాక శోభారాణి టెలిఫోనులో 'ప్రిలిమినరీ డిస్‌కషన్‌కి ఎప్పుడు కలుసుకుందాం?' అనిఅడిగారు. 'రాత్రి ఎనిమిదిన్నరకి మీరూ మీ శ్రీవారూ రండి' - అని చెప్పాము .... భోజనా లయేసరికి వాసిరెడ్డి సీతాదేవి వచ్చారు. ముగ్గురం ఏదో లోకాభి రామాయణం చెప్పుకుంటూండగా తెన్నేటి సుధా రామరాజు వద్ద నుంచి కాల్. "రామ రాజుగారు మీకు జ్ఞాపకం చేయ మన్నారు - ఈ సాయంత్రం మీ దంపతులు మా వంశీ ప్రెమిసిస్‌కి వచ్చి లైబ్రరీ, స్కూలూ, యాక్టివిటీస్ అవీ చూస్తామని చెప్పారట పోయినవారం .... సాయింత్రం అయిదు గంటలకు రమణరావుగారు మీవద్దకు వస్తారు - మిమ్మల్ని తీసుకొచ్చేందుకు,'' అన్నారు సుధ. బయటవూరు వెళ్లినప్పుడు మరీ అవసరమైతే తప్ప టెలిఫోన్ తాకదు మేడమ్ - మౌత్ పీస్ దగ్గిర చేయి అడ్డం పెట్టి, అవతల కొపనున్న దేవరో నెమ్మదిగా చెప్పాలి. వంశీ విజిట్ ముందే అనుకున్నది .... ''మీరు రాసిన క్లియొపాత్రా రేడియో నాటికలో నేను పాల్గొన్నాను - అప్పట్లో అదొక సరదా'' అన్నారు అడ్వకేట్ రమణ రావు రూమ్‌లోకి వస్తూ! ఏనాటి క్లియో పాత్రా ! షేక్స్‌పియర్‌నీ, బెర్నార్డ్‌షానీ మనసులో పెట్టుకు గంట నాటకంగా రూపాదించిన క్లియోపాత్రాని బుచ్చి బాబు ఎంతో మెచ్చుకున్నారు - తనకి ట్రాన్స్‌ఫరై వెళ్తూ, దానిని షెడ్యూల్ చేసి మరీ వెళ్లారు. అప్పట్లో స్క్రిప్ట్ జాగర్త చేయాలనే ధ్యాసవుండేది కాదు .... ఉవ్వి, ఉషారాణి యిలా రమణ.

రావుగారికీ మాకూ ఎందరో కామన్ .... పేదవిద్యార్థులకు సహాయకారిగా ఉండే సేవకార్యక్రమం తలపెట్టింది వంశీ సంస్థ. శాఖోపశాఖలుగా విస్తరిల్లిన వంశీ కార్యక్రమాల గురించి నాలుగు ముక్కలలో చెప్పడం సాధ్యమయే విషయం కాదు. డైనమిజమ్‌కి మారుపేరు వంశీ రామరాజు. ఇన్ని పనులు ఆయన యింత జయప్రదంగా ఎలా నిర్వహించ గలుగుతున్నారా అని ఆశ్చర్యం కలుగుతుంది .... డాబా మీద యిష్టా గోష్టిలో 'రైటర్స్ కోఆపరేటివ్', టివిసీరియల్స్, యిత్యాది విషయా లనేకం ప్రసంగవశాన దొర్లాయి .... రాత్రి తొమ్మిది గంటలకు శోభారాణి, రాఘవరావు వచ్చారు రూమ్‌కి. భార్యాభర్త లిద్దరూ సివిల్ ఇంజనీర్స్ .... మాలతీ చందూర్‌ని రేపు టివిలో శోభారాణి యింటర్వ్యూ చేయాలి గనక పరస్పరావగాహన కోసమైన కబుర్లు. మాలతీ చందూర్ రాసిన ప్రతినవల ఎంతో శ్రద్ధగా చదివిన అభిమాన పాఠకురాలు శోభారాణి. మా నలుగురి మాటలూ ముగిసేసరికి పన్నెండు దాటింది. నిజానికి ముగియలేదు. – యింకా మాట్లాడాలనే వుంది వారికీ మాకూ కూడా ! అయితే, రాఘవరావు గారే 'యిక లేదాం' అన్నారు శోభారాణితో.

. . . . . 05

ఆంధ్ర సారస్వత పరిషత్తుకి ('గీటురాయి' ఫంక్షన్) తను వచ్చి తీసుకువెళ్తానన్నారు వాసిరెడ్డి సీతాదేవి– 'మామయ్యా' అని పిలిచే సీతాదేవి మరొక మేనకోడలు.... టిఫిన్లయి పరిషత్తుహాలు చేరుకొనేసరికి సరిగ్గా పది.... తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ వారి 'గీటురాయి'కి పదేళ్ళు నిండిన సందర్భంగా జరుపుతున్న ఉత్సవమిది. అధికార భాషా సంఘాధ్యక్షులు నండూరి రామకృష్ణమాచార్య, 'ఆంధ్రప్రభ' సంపాదకులు పొత్తూరి వెంకటేశ్వరరావు, పద్మశ్రీ బోయి భీమన్న, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, మల్లాది సుబ్బమ్మ, మాలతీ చందూర్ మున్నగువారు పాల్గొన్నారు. వీరుగాక సుప్రసిద్ధులైన ముస్లిమ్ పండితులు కూడా కొందరు పాల్గొన్నారు. 'హదీసు వెలుగు', 'సందేహాలు – సమాధానాలు' అనే రెండు పుస్తకాలు ఈ సందర్భంగా విడుదల చేశారు.... అన్ని మతాలూ సహనాన్నీ సత్సంప్రదాయాలనీ శాంతి సామరస్యాలనీ, సర్వ మానవ సౌభ్రాతృత్వాన్నీ ప్రబోధించేవే ! అయితే ఆచరణలో, కాలావసరాలని బట్టి ఏర్పడే నియమ నిబంధనలలో, దైనందిన జీవిత పద్ధతులలో అనేక మార్పులూ చేర్పులూ అనివార్యమవుతాయి. మనం సమస్తానికీ వేదప్రమాణం చెప్పుకున్నట్లే వారు 'దివ్య గ్రంథాన్ని' (ఖుర్‌ఆన్) చెప్పుకుంటారు. మరొకరు 'బైబిలు' చెప్పుకుంటారు. ఇంకోరు యింకొకటి చెప్పుకుంటారు. కొందరు ముస్లిమ్ సోదరులు మాట్లాడే స్వచ్ఛమైన తెలుగు, ఆ చక్కటి ఉచ్చారణ మనం ఎందుకు అలవరుచుకోలేక పోయామా అని పిస్తుంది ఒక్కోసారి. మృదుమధుర

మైన తెలుగు చాలా చక్కగా వాడే 'గీటురాయి'కి జాతీయ సమైక్యతా కృషిలో ఎంతో భవిష్యత్తు ఉంది.... మీరు లంచ్‌కి వుండకుండా వెళ్లడం బావులేదన్నారు మలిక్. దూరదర్శిని కారణంగా వెళ్లవలసి వస్తోందని ఆయనని వొప్పించి, బయటకొచ్చేసరికి 'ఆటోగ్రాఫ్ హంటర్స్' మాలతిని చుట్టుముట్టారు. ఆ తర్వాత కారు తలుపు తెరవబోతూ వుండేసరికి, పరిషత్తు హాలు వెనుక భాగాన పర్దాలో వున్న లేడీస్ మాలతికోసం కబురుపెట్టారు. లోనికి వెళ్లి ముస్లిమ్ సోదరీమణులని కలుసుకున్నదామె. 'వారు చూపిన ఆప్యాయతకీ అనురాగానికీ నా కళ్లలో నీళ్ళు తిరిగాయి' – అని చెప్పిందామె కారులో కూచున్నాక. అందుకు కారణం లేకపోలేదు. 'ఈ సభలో పురుషులే తప్ప స్త్రీలు కనపడటంలేదు. ఇస్లామ్ ప్రారంభ దశలో స్త్రీలకు పురుషులకు సమాన ప్రతిపత్తి ఉండేది. సమాజపరంగా వారికి సముచిత స్థానం ఉండేది. కలీఫాలలో అధికార తృష్ణ, సామ్రాజ్య కాంక్ష పెరగడంతో స్త్రీలను వెనక్కినెట్టారు.... ఇవి నా మాటలు కాదు - నెహ్రూగారు 'గిమ్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ'లో చెప్పిన మాటలు'' - అని మాలతి తన ప్రసంగంలో చెప్పింది. తమ అభిమాన రచయిత చెప్పిన పలుకులకు ముస్లిమ్ వనితలు హర్షాతిరేకం వెలిబుచ్చడంలో ఆశ్చర్యమేమున్నది?.... రెండు గంటలకు రమణి వచ్చి టివి కేంద్రానికి తీసుకువెళ్ళారు. అనుకున్న పని ఆడుతూ పాడుతూ చేసెయ్య గలగడం ఆమె ప్రత్యేకత ; విరామ మెరుగని విరునవ్వుతో ఉత్సాహమే ఊపిరిగా గల ఉద్యోగిని ; ఉద్యోగ ధర్మంతో సైతం కళాత్మక విలువలు కాపాడే సహృదయిని.... అయిదులోపలే రికార్డింగ్ అయిపోయింది.... హోటల్‌కొచ్చి బట్టలు మార్చుకుని మల్లాది సుబ్బమ్మగారి వికాస కేంద్రానికి! మహిళాభ్యుదయ సంస్థ, అభ్యుదయ వివాహవేదిక, వైవాహిక కుటుంబ సలహాకేంద్రం, మహిళాభ్యుదయ గ్రంథాలయం - యిలా చాలా ఉన్నాయి.... శంకర్ రథ బోధకునిగా సీతాదేవీ మేమిద్దరమూ సభాస్థలికి ఆరుగంటలకు చేరుకున్నాం.... పరస్పర పరిచయాలు, పాత మిత్రుల క్షేమ సమాచారాలూ అయాక, వాసిరెడ్డి సీతాదేవి అధ్యక్షతను సభ జరిగింది. స్త్రీలకు జరిగే అన్యాయాలను ప్రతిఘటించి పురుషాధిపత్యాన్ని ధిక్కరించాలన్నారు మల్లాది సుబ్బమ్మ. విద్యార్థులు ఒకే తీరున వున్నప్పటికీ, ఉద్యోగాలివ్వడంలో వివక్షత లేకపోలేదన్నారు అధ్యక్ష స్థానంలోని వాసిరెడ్డి సీతాదేవి. మద్రాసు హిందీ ప్రచార సభలో తను వుంటున్న రోజులనుంచీ మా మధ్య ఏర్పడ్డ సాహితీ పరిచయమూ కుటుంబ స్నేహమూ గురించి కూడా చెప్పారామె. సమాజంలోని స్త్రీ పురుషులు పరస్పరాశ్రితులనీ, యిరువురినీ విడివిడిగా చూడటం కంటె సామాజిక దృక్కోణం నుంచి చూడాలనీ, గాంధీజీ

?

"They say Viswamitra taught the skills of archery and several mantras to Rama and Lakshmana to enable them guard the sacrificial fire. When the sage himself was so proficient, why should he seek the help of the youngsters to the dismay of their father ?"

"To prepare Rama for the mission of his life," said Raghu's Father.

"How could Viswamitra know about the banishment that was to come later ?" questioned Raghu.

"Viswamitra was a Trikalagnya - one who could see in the present, the past as well as the future. Viswamitra was aware that Rama was an incarnation of Vishnu - born on this earth to curb the evil and re-establish order. From the confines of the regal palace, Viswamitra brought him out into a wider world of abundant grace and beauty, the enchanting nature and reverberating life. Rama drank deep from the well of knowledge and met his spouse. Whether it was Vasista or Viswamitra, ancient sages would divulge information only to the extent the situation demands. To them word of mouth was a vehicle of thought leading to action. By guarding the sacrificial fire of Viswamitra successfully, Rama could establish himself as a superior being destined for something great."

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*

పిలుపుతో ఉత్తేజితమైన భారత స్త్రీ జాతి ఆనాటి ఆశయాలు ఎందు వల్ల కోల్పోతున్నదో పరిశీలించవలసి వున్నదనీ, స్త్రీల సముచిత స్థానానికి ఆదినుంచీ పోరాడుతున్నది రామ్మోహనరాయ్, వీరేశలింగం వంటి పురుషులేననీ ముఖ్యఅతిథి మాలతీ చందూర్ చెప్పారు - 'స్త్రీస్వేచ్ఛ' అనే పేరుతో వెలువడుతున్న ఈ సంస్థ వారి పత్రిక ప్రథమ సంచికను విడుదలచేస్తూ! 'ఫ్రీడమ్' అనే మాటకు కుడి ఎడమలు వున్నాయనీ, అది వ్యక్తి వికాసానికి తోడ్పడినప్పుడే ప్రగతి పథమవుతుందని అన్నారు ఇండియన్ రేషన్‌లిస్ట్ అసోసియేషన్ అధ్యక్షులు యమ్వీ రామ్మూర్తి. అంత్రోపాలజీ, సైకాలజీల దృష్ట్యా స్త్రీ పురుషుల స్థానాన్ని వివరించారు ఉస్మానియా యూనివర్సిటీ రీడర్ భారతి. అన్నపూర్ణా సాగర్ స్వాగతం తెలుపగా, డాక్టర్ కళ్యాణి వందన సమర్పణ గావించారు.

. . . . . 06

కెయమ్ రావు శకుంతలారావు దంపతులు జుబిలీ హిల్స్‌లో ఇల్లు కట్టుకుంటున్నప్పుడు, గృహప్రవేశానికి రావాలని చెప్పారు ; గృహప్రవేశం ముందు రెండు తడవలు టెలిఫోన్ చేశారు, మీరు మా గెస్టులుగా వస్తున్నారని చెప్పారు - కాని, వెళ్లడం పడలేదు. పోయిన సంవత్సరం వారు మద్రాసు వచ్చినప్పుడు, అందరం ఒక రోజు కంజీవరం వెళ్లాం (ఆయన సంవత్సరానికి నాలుగైదు సార్లు వస్తారు అమెరికా నుంచి ; కాని, ఈమె ఒక్కసారే వస్తుంది, అమెరికాలో స్థిరపడ్డారు - సిటీజన్‌షిప్ పుచ్చుకున్నారు - నలుగురు అమ్మాయిలు : శ్రీదేవి, పద్మిని, మాధవి, లలిత, వారూ పౌరసత్వరీత్యా అమెరికావాసులే! అమ్మాయిలలో ముగ్గురు బాగా తెలుసు -- ఆంటీ, అంకుల్ అంటే వారికెంతో యిష్టం) .... జనవరిలో శకుంతలారావు దంపతులు మద్రాసు వచ్చారు -- ఒకసాయింత్రమంతా మాతో గడిపారు. జనవరి 27, 28 లలో మేము హైదరాబాదులో ఉన్నప్పుడు, వారు మద్రాసులో ఉన్నారు. 28వ తేదీన మేము హైదరాబాదులో చార్మినార్ ఎక్కితే, వారు మద్రాసులో చార్మినార్ ఎక్కారు. 'గీటురాయి' ఫంక్షన్‌కి వచ్చినప్పుడు తప్పకుండా మీకొత్తయింటికి వస్తామని చెప్పాము.... మొన్న సాయింత్రం 'వంశీ' వారి యిష్టాగోష్టికి, శకుంతలారావు రావల్సి వుంది ; కాని, కమ్యూనికేషన్ గాప్ వల్ల అమె రాలేకపోయారు.... ఈ ఉదయం మొదటి ప్రోగ్రామ్ వారింటికి వెళ్లడం. తొమ్మిది గంటలకి కెయమ్ రావు వద్దనుంచి టెలిఫోన్ వచ్చింది : 'రెండు రోజులుగా ఊళ్లోలేను. రాత్రి పదకొండింటికి వచ్చాను. ఒక అర గంటలో మిమ్మల్ని పికప్ చేసుకొనేందుకు వెహికిల్ వస్తుంది' - అన్నారు .... ఆ సువిశాల భవనం, వారి సౌజన్యానికీ సంపదకు, సహృదయతకు తగ్గట్టుగా ఉంది. ఒక పోర్షను, తాము వచ్చినప్పుడు వుండేందుకు వీలుగా

అట్టేపెట్టుకు మిగతాది 'టుబాకో' వారికి గెస్ట్‌హవుజ్‌గా అద్దెకిచ్చారు. ఆ యిల్లూ, ఆ ఫర్నిచరూ, ఆ గాడ్జెట్సూ గురించి చెబితే మిత్రులని పొగుడుతున్నాననుకుంటారు.... మధ్యాహ్నం మూడుగంటల దాకా మేము వుంటామనీ వుండాలనీ అనుకున్నారు వారందరూ ! ఉండిపోదామని అనిపించినా, కాలం గడుస్తున్న కొద్దీ తలకి చుట్టుకొనే బాధ్యతలు, వుండనివ్వవు ; సమస్తం గంటల వారీ లెక్కించమంటాయి ; మౌనగీతం పలికే మనసుని ఊరుకోబెడతాయి .... 'భోజనానికి వుండటం లేదు - టీ యివ్వండి - టీ తీసుకు వెళ్తాం' - అన్నాను శకుంతల గారితో .... 'డాక్టరు అపాయింటుమెంటు వుంది - అరగంటలో వస్తాను' అని చెప్పి వెళ్లిన కెయమ్ రావుగారు రాకుండానే, అమ్మాయిలూ ఆమె అయిష్టంగా మమ్మల్ని పంపుతున్నా, బయటికి వచ్చాం. కాంపవుండ్‌లో మూడో నాలుగో మారుతీలు కనిపించాయి. ఆ మారుతీలు మీవేనా ?' - అని అడిగాము. 'అవును - కావాలంటే ఒకటి మద్రాసు తీసుకువెళ్లండి' - అన్నారు శకుంతలారావు. అది మర్చిపోలేని మాట అంత సొంపైన మాట, అటువంటి స్నేహానురాగధార అరుదవుతున్న రోజులలో, అవి పొందగలగటం మా అదృష్టం గాక మరేమిటి ? .... నల్లకుంటలో మాలతిని దింపి అబిడ్స్ వైపుగా వస్తున్నప్పుడు శ్రీదేవి అడిగింది : 'అంకుల్, ఈనెల 26 వ తేదీన వంశీ బెర్కలి ఫంక్షన్ నా డాన్స్‌లో పెర్‌ఫారమెన్స్ వుంది - ఆ డ్రస్సులు కలెక్ట్ చేసుకోవాలి యిప్పుడు, ఆరోజున మీరు వస్తే మా యింట్లో అందరికీ బావుంటుంది. సాధ్యం కాదమ్మా, రసికరంజనిలోనో మైలాపూర్ ఫైన్ ఆర్టస్‌లోనో (మద్రాసు) చేయకపోవు. అప్పుడు చూస్తానుగా' - అన్నాను ఆమెని బుజ్జగిస్తూ .... సాయింత్రం చార్మినార్‌లో మద్రాసుకి.

. . . . 09

ఫెస్టివల్ ఆఫ్ ఫ్రాన్స్ - ఇండియా 1989 (Festival of France - India 1989), ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్ (Indian Council for Cultural Relations) సంయుక్తంగా లైయన్ ఒపెరా బాలె (Lyon Opera Ballet), మ్యూజిక్ అకాడమీలో ఏర్పాటు చేశారు. చక్కటి శిక్షణ పొందిన యువతీ యువకులు జానపదరీతులని, అధునాతన పద్ధతులని వేర్వేరు అయిటమ్స్ ద్వారా తమ నృత్య కౌశలంతో ప్రదర్శించి, తమ సంప్రదాయంతో ఏమాత్రం పరిచయం లేనివారిని రసాంబుధిలో మునకలు వేయించారు.

. . . . . 11

"'అమెరికాలోని తెలుగు కుటుంబాలు, ఇరవై పాతికేళ్లక్రితం తాము అమెరికా చేరుకున్నప్పుడు, యిక్కడి స్త్రీలు నోములు వ్రతాలూతో ఎలా వుండేవారో యిప్పుడూ అలాగే ఉన్నట్లువారు భావిస్తున్నారు. సమాజపరంగా యిక్కడ వచ్చిన మార్పుల

గురించిన అవగాహన వారికి లేదు' - అని రామలక్ష్మి చెప్పింది.... అక్కడి వారు కష్టజీవులు ; సోమరితనమనే దానికి చోటులేదు ; పరుగుపందెంలో అందరూ పాలొన వలసిందే ! వీకెండ్స్ కోసం వారు ఎంత ఆత్రంగా ఎదురు చూస్తారో మనకి తెలీదు - అవే వారికి పండగ దినాలు, పుట్టిన పండగ, మారేజ్ యానివర్సరీ - యిలాటివి ఆ తేదీలలోగాక వీకెండ్ లో జరుపుకొనే పద్ధతి వారిది. వండిన పదార్థాలు వృథా చేయడమనేది పొర బాటున కూడా జరగదు. పండగలు చేయడం, ఆలయాలు కట్టించడం - యిలాటి ఆచారాల ద్వారా తమ సంస్కృతిని కాపాడుకోవాలనే తాప త్రయం వారిది' - అని చెప్పారు అరుద్ర" .... ఇవ్వాళ 'ఫ్రెండ్స్ సర్కిల్' పొట్టి శ్రీరాములు హాలులో జరిపిన గోష్టికి, వివరంటా వుండ టానికి వీలు కుదరని కారణంగా 'ఏం మాట్లాడారు ?' అని మాలతిని అడిగి నప్పుడు, ఆమె చెప్పిన మాటలలోని ముఖ్యాంశమది.

. . . . . 15

పొద్దుట తొమ్మిదిగంటల అయిదు నిముషాలకు హొటల్ స్వాగత్‌లోని మినీ కళ్యాణ మండపంలో పేకేటి శివరామ్ దంపతుల నాల్గవ కుమా రుడు చి॥ గోపాల్‌కీ, బొంబయి వాసు లైన బెనర్జీ దంపతుల సౌ॥ రేణుకీ శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. ఫిలిమ్ పరిశ్రమలోని పెద్దలనేకులు వచ్చి నూతన వధూవరులను ఆశీర్వ దించారు. నవదంపతులకు మా శుభా కాంక్షలు.... జంధ్యాల నూతన గృహ ప్రవేశం ఇన్విటేషన్ యథాతథంగా చెబుతాను.... 'శుభమస్తు' -శ్రీచందూర్ వారికి 'ప్రేమలేఖ'.... 84 కామదార్ నగర్ - మద్రాసు - 34 అనే ఇంటితో గత సంవత్సరం నాకు 'మూపులు కలిసిన శుభవేళ,' ఆ ఇల్లు నాతో 'నీకూ నాకూ పెళ్ళంట' అన్న క్షణాన, 'నెలవంక' సాక్షిగా ఇంత త్వరగా నేను 'అహ నా పెళ్ళంట' అని ఆనం దంగా చెప్పుకోగలనని ఊహించలేదు .... 'ముద్ద మందారం' లాంటి ఆ ఇంటి నిర్మాణం పూర్తయిన సంద ర్భంగా పెద్దలు నన్ను ఓ ఇంటివాణ్ణి చేసే 'మూడుముళ్ళ' ముహూర్తాన్ని ఫిబ్రవరి 15, 1989 ఉదయం 8-27 ని॥లకు నిర్ణయించారు.... 'హై హై నాయకా!' అంటూ ఆ జగ న్నాటకకర్తను స్తుతిస్తూ మేం గృహ ప్రవేశం చేసే ఆ ముహూర్త సమ యానికి మీరు సకుటుంబంగా. మీ 'చంట బ్బాయ్'లతో సహావిచ్చేసి, మా 'మొగుడూ పెళ్ళాల'ను, మా చిన్ని 'మల్లెపందిరి'ని ఆశీర్వదించి, 'ఆనంద భైరవి' రాగాలాపనలో పాలుపంచు కుని ఈ 'నాలుగు స్తంభాలాట' ను జయప్రదం చేయాలని ప్రార్థిస్తున్నాను .... భవదీయ జంధ్యాల.... 'వివాహ భోజనంబు' - మధ్యాహ్నం 12 గంటల నుండి.... భోజనం చేసి వచ్చాను.... ఇక సాయింత్రం అబట్స్ బరీలో షేక్ చిన మౌలానా నాద

# రేబిస్ (పిచ్చికుక్క కాటు) ప్రాణాంతకం. అయితే దానిని అరికట్టవచ్చును.

**అది ఏ విధంగా వస్తుంది?**

- పిచ్చి జంతువు ఏదైనా ముఖ్యంగా కుక్కలు కరిచినప్పుడు. రేబిస్ వస్తుంది
- ఒకసారి రేబిస్ వస్తే, అది మరణానికి దారితీస్తుంది కారణం రేబిస్‌ని నయం చేయడానికి చికిత్స అంటూ ఏమీ లేదు

**నిరోధన**

- అయితే రేబిస్‌ను రాకుండా చేయవచ్చును పెంపుడు కుక్కలన్నింటికి రేబిస్ రాకుండా టీకాలను ఇప్పించండి

  ఊరకుక్కలను పట్టుకోవటం కోసం అవి తిరగకుండా చూడటం కోసం. అధికారులకు సహాయపడండి. కారణం ఊరకుక్కలు పిచ్చివై అవి పెంపుడు కుక్కలను కరుస్తాయి
- మిమ్మల్ని కుక్క కరిచినప్పుడు. గాయాన్ని సబ్బుతోను. నీళ్ళతోను శుభ్రంగా కడిగి దగ్గరున్న ఆసుపత్రి లేక చికిత్సా కేంద్రానికి వెళ్లండి

**రేబిస్ రాకుండా టీకాలు**

- డాక్టరు సలహా మీద. రేబిస్ రాకుండా టీకాలను వేయించుకోండి





సెంట్రల్ హెల్త్ ఎడ్యుకేషన్ బ్యూరో
డిజి హెచ్ ఎస్, కోట్లా రోడ్డు న్యూ ఢిల్లీ

davp 88/782 Tel

స్వరంతో, కళాక్షేత్ర విద్యార్థినీ విద్యార్థుల 'సీతా స్వయంవరం' నృత్య నాటికా ప్రదర్శనతో, డా॥ ప్రతాప్ రెడ్డి దంపతుల (అపోల్లో) కుమార్తె సౌ॥ సంగీతకు, బొంబయి హైకోర్టు ఛీఫ్ జస్టిస్‌గా రిటైరైన మాధవ రెడ్డి దంపతుల కుమారుడు చి॥ విశ్వేశ్వర్‌కు ఈ ఉదయం వివాహం జరిగిన సందర్భంగా రిసెప్షన్.... క్లోజ్‌డ్ సర్క్యూట్ టివి అవటంవల్ల, మనం కూర్చున్న సీటులోనుంచే ఎవరెవరు వచ్చి నవదంపతులకు శుభాశీస్సులు తెలుపుతున్నదీ చూడవచ్చు. కరుణానిధి, రామకృష్ణ హెగ్డె, సుబ్రహ్మణ్యస్వామి మున్నగువారెందరో వచ్చారు. రూపంలో, విద్యలో, వినయంలో, సంపదలో అన్నిటా ఉన్నతస్థాయిని వున్న నూతన వధూవరులకు మా శుభాభినందనలు.

. . . . . 20

ఖాదీ గ్రామోద్యోగ్‌వారి (గోపాలపురం) కాన్ఫరెన్స్ హాలులో పదిహేన్నెండు రోజుల క్రితం కేంద్ర సాహిత్య అకాడమీవారి బుక్ ఎగ్జిబిషన్ ప్రారంభమయింది. భారతీయ భాషలన్నిటిలోనూ సాధ్యమైనంత ఉత్తమ సాహిత్యాన్ని ప్రచురిస్తున్నాయి. సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్ ట్రస్ట్‌లు. సాహిత్యం దిగజారిపోతోందని ఫిర్యాదు చేసే చాలామంది పెద్దలు వీరి ప్రచురణల వంక చూడరు – ఇతర భాషలలో ఏమి వెలువడుతున్నాయో తెలుసుకోరు. ఇక గ్రంథాలయాలంటారూ, గ్రంథాలయోద్యమం ఒకప్పుడు రాజకీయ చైతన్యానికీ, ప్రజలలో విద్యాగంధం పెంచేందుకు దోహదకారి అయింది – ఇప్పుడు గ్రంథాలయ వ్యవస్థ లంచగొండితనంతో కుతకుత లాడుతోంది. అంచేత, మంచి సాహిత్యం మన లైబ్రరీలలో కనిపించదు. ఏ పుస్తక విక్రేత అంచెల వారీ డబ్బు పంచుతాడో అతని పుస్తకాలే గ్రంథాలయాల్లో చోటు చేసుకుంటాయి. ఇవి మా అనుభవంలోని విషయాలు కాకపోయినా, నమ్మ దగ్గ వ్యక్తులు చెప్పిన మాటలు. దేశభాష లందు తెలుగు లెస్స అని గుండెలు బాదుకోవడమే తప్ప తెలుగు పుస్తకాలని ఆదరించరు. సరి, ఆ విషయం వొదిలేద్దాం.... సాహిత్య అకాడమీ ప్రాంతీయ కార్యలయం కార్యదర్శి కృష్ణమూర్తి, పుస్తక ప్రదర్శన ముగిసేలోగా మాలతీ చందూర్ ఒక సాయింత్రం మాట్లాడాలన్నారు. (నా పార్లసారధి తమిళనవలకు మాలతీచందూర్ తెలుగు అనువాదం 'సమాజపుకోర్టల్లో' ఈ మధ్యనే సాహిత్య అకాడమీ వెలువరించింది.).... "ఈ శతాబ్ది ఏభైలలో ఇల్లిందల సరస్వతీదేవి, ఆచంట శారదదేవి, వాసిరెడ్డి సీతాదేవి, రామలక్ష్మి, నేనూ కథలు రాస్తూండే వారం. అప్పట్లో మా కథలు 'లిటరరీ కంటెంట్' వల్ల అచ్చయేవనే భ్రమ నాకు లేదు. స్త్రీలు రాస్తున్నవనే 'పాట్రనైజింగ్ స్పిరిట్'తోనే అనాటి సందపాకులు అవి అచ్చు వేసేవారు. కథల వారపత్రికలు మార్కెట్‌లోకి

రావడం, అవి చదివేవారు అధికంగా స్త్రీలే కావటంతో స్త్రీల రచనలకు ప్రాముఖ్యం పెరిగింది. ప్రేమలూ పెళ్లిళ్లూ, కుటుంబ కలహాలు, సంసార విషయాలు, పిల్లలు పెద్దలు, అశాని రాశులు, నాలుగు గోడల మధ్య జరిగే సంగతులు, చెరిగిన స్వప్నాలు, తీరిక సమయాల్లోని కలలు — యిలా టివి నవలలకీ, కథలకీ యితివృత్తా లయాయి. చదివే పాఠకులకి కూడా అలాటివే కావాలి.... రచనా వ్యాపకంలో స్త్రీకి కొన్ని లిమిటేషన్స్ వున్నాయి - పురుషునిలా ప్రతిచోటుకీ వెళ్లి విషయసేకరణ గావించగల అవ కాశ మామెకి తక్కువ. అన్నిరంగాల లోనూ లేరా ? - అని ప్రశ్నించవచ్చు. ఉంటున్నారు - అయాఉద్యోగాలని బట్టి! రచయితకి వుండే అవకాశాలు రచయిత్రికి ఉండవు. అందుకని అమె, తనకు అందుబాటులోవున్న కాల్పనిక సాహిత్యంలోనే, ఫిక్షన్‌లోనే అగ్ర స్థానం అందుకుంది. మన భాషలోను, మన దేశంలోనే కాదు - ప్రపంచ వ్యాప్తంగా" - అన్నారు మాలతీ చందూర్ తన ప్రసంగంలో. ప్రశ్నోత్త రాల సమయంలో డివి నరసరాజు 'చందూర్‌గారి ప్రభావం మీద లేదా?' అని అడిగినప్పుడు,' నేనింకా పరికిణీలు కట్టుకొనే రోజులలో, నండూరి సుబ్బారావుగారు, చలంగారు, శ్రీశ్రీ, సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారు, కొనకళ్ల వెంకటరత్నం - యిలా ఎందరో ప్రముఖ సాహితీపరులు ఏలూరులో మాయింటి కొస్తూండేవారు మామయ్య తో మాట్లాడటానికి ! అటువంటప్పుడు మామయ్య (చందూర్) ప్రభావం నా మీద వుండకుండా ఎలా ఉంటుంది?' - అంది మాలతి.... కార్యదర్శి కృష్ణ మూర్తి వందన సమర్పణతో సభ ముగిసింది.... 'ఈ కాసిని మాటలకి రెండొందలు యిచ్చారా? ఇకనుంచి ఎవరైనా మాట్లాడమని పిలిస్తే, ఎంత యిస్తారో ముందే కనుక్కో' - అంది మాలతి - యింటి కొస్తున్నప్పుడు కారులో.

.....23

బాలమురళీకృష్ణ దంపతుల మూడవ కుమారుడు చి॥ వంశీ మోహన్‌కి, గన్నవరపు భాస్కరరావు దంపతుల రెండవ కుమార్తె సౌ॥ రేఖకు, ఈ ఉదయం 7 గం॥ 54 ని॥లకు మీనలగ్నంలో వేదో క్తంగా వివాహం జరిగింది. సాయిం త్రం రిసెప్షన్‌లో గాయత్రి వీణ. లాయడ్స్ రోడ్ గీతాభవన్ కల్యాణ మండపంలో జరిగిన ఈ శుభకార్యానికి పొద్దుటా సాయింత్రం అనేకమంది బంధుమిత్రులు అధిక సంఖ్యలో వచ్చి శుభాశీస్సులు తెలిపారు. అబ్బాయీ అమ్మాయీ ఒకరికొకరు తీసిపోనంత చక్కగా ఉన్నారు. నూతన ద్వయా నికి మా మనఃపూర్వక దీవనలు.

—యన్నార్ చందూర్